

# CHANDAMAMA

It unfolds the glory of India—both past and present—through stories, month after month.

Spread over 64 pages teeming with colourful illustrations, the magazine presents an exciting selection of tales from mythology, legends, historical episodes, glimpses of great lives, creative stories of today and knowledge that matters.

**In 11 languages and in Sanskrit too.**

Address your subscription enquiries to:
**DOLTON AGENCIES** 188 N.S.K. ROAD MADRAS-600 026



# చందమామ

సెప్టెంబర్ 1997






విడిప్రతి : 6.00

సంవత్సర చందా : 72.00

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'    సంచాలకుడు : బి. నాగిరెడ్డి




## అనైక్యతాశాపం!

బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ, వ్యాపారం చేసుకోవడానికి భారతదేశానికి వచ్చింది. అలా మనదేశానికి వచ్చిన కంపెనీలలో అది మొట్టమొదటి పాశ్చాత్య కంపెనీకాదు. పోర్చుగీసులు, డచ్ వాళ్ళు, ఫ్రెంచి వ్యాపారులు కూడా వచ్చారు. అయితే, బ్రిటిష్ వాళ్ళకు అధికార దాహం మరీ ఎక్కువ. దేశాన్ని వశపరుచుకుని దానిని తమ జమీందారీగా చేసుకోవాలని ఉవ్విళ్ళూరసాగారు. 1765వ సం॥లో స్థానిక పాలకుడైన నవాబుతో చేసుకున్న ఒప్పందం ప్రకారం ఈస్టిండియా కంపెనీ — బెంగాల్, బీహార్, ఒరిస్సా ప్రాంతాలకు ఒక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. దానిని 'జాన్ కంపెనీ రాజ్!' అనేవాళ్ళు.

భారతదేశంలోని ఇతర ప్రాంతాలను కూడా ఆక్రమించుకోవడానికి కంపెనీ అధికారులు అవినీతికరమైన పద్ధతులను అవలంబించారు. అన్యాయమైన మార్గాలను అనుసరించారు. భారతీయ సంప్రదాయాలను నేలరాశారు. ప్రజల అభిప్రాయాలను, నమ్మకాలను ఉదాసీనంచేశారు. అవసరంకొద్దీ కొందరు సంస్థానాధిపతులతో చేతులుకలిపి అవసరం తీరాక తెగతెంపులు చేసుకున్నారు. వీలున్నచోట వెన్నుపోటు పొడిచారు!

ఈ పరిస్థితికి కేవలం జాన్ కంపెనీని మాత్రమే నిందించగలమా? కంపెనీ అధికారులు స్వార్థపరులే కాని మనరాజుల మధ్య ఐకమత్యం ఉన్నట్టయితే కంపెనీ పథకాలు పారేవి కావు. దురదృష్టవశాత్తు మన సంస్థానాధిపతులు ఒకరితో ఒకరు కలహించుకుంటూ, కయ్యాలకు కాలుదువ్వసాగారు. వారిలో కొందరు నిజంగానే దేశభక్తులయితే, చాలా మంది పొరుగు రాజులతో శుష్కవైరాలు పెంచుకుని, జాన్ కంపెనీసాయంతో పగతీర్చుకోవాలని ఉబలాటపడ్డారు.

మరి అప్పటి సామాన్యప్రజల మాటేమిటి? బ్రిటిష్ అధికారదర్పానికీ, దౌర్జన్యానికీ మౌనంగా తలలు వంచారా? లేక ఎదురు తిరిగారా? సాధ్యమైనప్పుడల్లా ఎదురుతిరిగారు. చేయగలిగినప్పుడల్లా తిరుగుబాట్లు చేశారు. వాటిని గురించి తరవాత తెలుసుకుందాం!


| | | |
|---|---|---|
| సంపుటి : **101** | సెప్టెంబర్ **'97** | సంచిక: **3** |
| విడిప్రతి : **6 - 00** | సంవత్సర చందా | **72- 00** |




వార్తలు–విశేషాలు:

# హాంకాంగ్

యాభై సంవత్సరాల క్రితం బ్రిటన్, ఇండియాను వదిలి వెళ్ళింది. బ్రిటన్‌తో ఏర్పరచుకున్న 99 సంవత్సరాల లీజు పూర్తికావడంతో, రెండు నెలలక్రితం హాంకాంగ్ మళ్ళీ చైనాతో కలిసింది. హాంకాంగ్‌లో దాదాపు 160 సంవత్సరాలు కొనసాగిన బ్రిటిష్ వలసపాలన జూన్ 30వ తేదీతో అంతమయింది!

చైనాకు దక్షిణాగ్రంలో ప్రధాన భూభాగానికి ఆనుకుని ఉన్న దాదాపు 200 దీవులలో ఒకటి హాంకాంగ్. 1841వ సం॥లో బ్రిటన్‌తో జరిగిన ఓపియం (నల్లమందు) యుద్ధంలో చైనా ఓడిపోయింది. మరు సంవత్సరం హాంకాంగ్ బ్రిటన్ వశమయింది. ఇరవైయేళ్ళలోగా మరొక యుద్ధం జరిగి 1860వ సంవత్సరంలో కోలూన్‌ను బ్రిటన్ పట్టుకున్నది.1898వ సం॥లో చైనా 'నూతన ప్రాంతాలతో' కలిపి హాంకాంగ్‌ను బ్రిటన్‌కు 99 సంవత్సరాలకు లీజుకు ఇచ్చింది.

1984వ సం॥లో ఉభయదేశాల మధ్య ఏర్పడిన ఒడంబడిక ప్రకారం హాంకాంగ్, కోలూన్, నూతన ప్రాంతాలను చైనాకు అప్పగించడానికి బ్రిటన్ అంగీకరించింది. అప్పగించవలసిన తారీఖు 1997 జూన్ 30 అని అప్పుడే నిర్ణయించారు.

దాదాపు వంద సంవత్సరాలలో బ్రిటన్ అధికారంలో హాంకాంగ్ వాణిజ్యరంగంలో అద్భుతమైన అభివృద్ధిని సాధించింది. బొంబాయి, సింగపూర్‌లలోలాగా హాంకాంగ్‌లో సహజమైన రేవు అభివృద్ధి చేయబడింది. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో మాత్రం అభివృద్ధి కొద్దిగా కుంటుపడింది. ఆ తరవాత అభివృద్ధి వేగం పుంజుకున్నది. ఇతర దేశాల ప్రజలు ఉద్యోగ వ్యాపారాల కోసం హాంకాంగ్‌కు వలస వచ్చి క్రమంగా అక్కడే స్థిరపడసాగారు.

హాంకాంగ్ మళ్ళీ చైనాతో కలిసిన తరవాత బ్రిటిష్ పాలనలో ఉన్న స్వేచ్ఛ, సంపదలు కొనసాగగలవా అని కొందరు సంశయించారు. 1984వ సం॥లో ఏర్పడిన ఉభయ దేశాల ఒడంబడికలో ఉమ్మడిగా ఈ విషయాలలో కొన్ని నిర్ణయాలు తీసుకున్నారు:

హాంకాంగ్ ప్రజలకు వ్యక్తిగత స్వాతంత్ర్యం ఉంటుంది. ప్రత్యేక పాలనా ప్రాంతంగా గుర్తించబడే హాంకాంగ్‌కు, చైనాదేశ చట్టాలు వర్తించవు. యాభై సంవత్సరాల వరకు ఇదే స్థితి కొనసాగుతుంది. హాంకాంగ్‌కు ప్రత్యేక శాసన సభ, కరెన్సీ, పన్నుల విధానం అమలులో ఉంటాయి. విదేశాంగ, రక్షణ వ్యవహారాలలో మాత్రమే చైనాకు అధికారం ఉంటుంది.

అధికార మార్పిడి కార్యక్రమంలో బ్రిటిష్ ప్రభుత్వం తరఫున ప్రిన్స్ చార్లెస్, చైనా తరఫున ప్రెసిడెంట్ జియాన్ జెనిన్ హాజరయ్యారు. గవర్నర్ క్రిస్ ప్యాటన్, చైనా ప్రధాన అధికారి టుంగ్ చీహ్వాకు లాంఛన ప్రాయంగా అధికారాన్ని అప్పగించాడు.

జూన్ 30వ తేదీ బ్రిటన్ బాణాసంచాలు పేల్చింది. మరునాడు చైనా పదివేల పావురాలను ఎగురవేసి ఆనందాన్ని చాటుకున్నది!





# కనకదాసు కవిత్వం

కోసలరాజ్యంలో కనకదాసు అనే రైతు వుండేవాడు. మనిషి మంచివాడు. ఉన్న కొద్దిపాటి పొలం సాగు చేసుకుంటూ, అంతగా ఆశలులేనివాడు కావడం వల్ల సుఖంగా కాలం గడుపుతున్నాడు.

ఒక పర్యాయం కనకదాసు వుండే గ్రామానికి విష్ణుశర్మ అనే కవి వచ్చాడు. ఆయన కవిత్వం వినడానికి గ్రామస్థులు రామాలయం ఆవరణలో చేరారు. విష్ణుశర్మ తన కవిత్వం వినిపించాడు. సరళ శైలిలో, ఉత్తమ భావాలతో వున్న ఆయన కవిత్వం పామరులకు సైతం అర్థమైంది. అందరూ ఆయనను అభినందిస్తూ కరతాళ ధ్వనులు చేశారు. కొందరు ఆయనమెడలో పూలదండలు వేస్తే, మరికొందరు డబ్బు చదివించి తమఅభిమానంచాటుకున్నారు.

విష్ణుశర్మ గ్రామస్థులకు కృతజ్ఞతలు చెప్పుకుంటూ, తన కవిత్వానికి రాజుగారిచ్చిన పచ్చలపతకం, జమీందారు ఇచ్చిన బంగారుకడియం వాళ్ళకు చూపించాడు.

విష్ణుశర్మ కవిత్వం వినడానికి వచ్చిన వారిలో కనకదాసు కూడా వున్నాడు. ఆయనకు జరిగిన సన్మానం అతడికి అద్భుతమనిపించింది. ఆ రాత్రి కనకదాసుకు నిద్రపట్టలేదు. ఇంతకూ, గ్రామస్థులు ఆయనకు అంతగొప్పగా ఎందుకు సన్మానం చేశారా, అని ఆలోచించసాగాడు.

అలా ఎంతోసేపు ఆలోచించిన మీదట, కనకదాసుకు కవిత్వానికెంత విలువ వున్నదో అర్థమైంది. అదే క్షణాన తాను కూడా కవిత్వంచెప్పి, పదిమందినీ మెప్పించాలన్న ఆలోచన వచ్చింది. మెప్పించగలిగితే తనుకూడా రాజుగారి నుంచీ, జమీందారు నుంచీ పచ్చలపతకం, బంగారు కడియమే గాక, ఇతరుల నుంచి కూడా అంతో ఇంతో ధనం సంపాయించవచ్చు!

ఎన్. శివనాగేశ్వరరావు

కనకదాసుది వానాకాలం చదువు. అయినా అతడు నిరుత్సాహపడలేదు. అప్పటికప్పుడు కలం పుచ్చుకుని, దీపం బుడ్డిముందు కూర్చుని కవిత్వం రాయ సంకల్పించాడు. అయితే, దేన్ని గురించి కవిత్వం రాయాలో ఒకపట్టాన స్ఫురించ లేదు. గురకపెడుతూ నిద్రపోతున్న భార్య మీద పడింది కనకదాసు దృష్టి.

అమరుక్షణం, కనకదాసుకు కవితా వస్తువు దొరికింది! అతడు భార్య గురక మీద కవిత్వం రాశాడు. ఆ రాసింది చదువుకుంటే, అతడికి మతిపోయినంత పనయింది. ఇంత గొప్పగా రాసింది నేనేనా అని ఆశ్చర్యపోయాడు.

చాలాసేపటికి కనకదాసుకు కునుకు పట్టింది. కలలో, గ్రామస్థులు అతణ్ణి పల్లకీలో కూర్చోబెట్టి మోసుకుంటూ రాజు గారి దగ్గరకు తీసుకుపోయారు. రాజుగారు, కనకదాసు రాసిన కవిత్వం విని ముగ్ధుడై, అతడి కాలికి గండపెండేరం తొడిగాడు.

ఆ రాత్రి తెల్లవారకముందే కనక దాసుకు మెలకువ వచ్చింది. కల గుర్తు చేసుకుని ఎంత గానో మురిసిపోయాడు. అతడికి తన కవిత్వం ఎవరికైనా వినిపిం చాలన్న తలంపు కలిగింది. పొరుగింటి నూకాలుతో అతడికి మంచి స్నేహం వుంది. అతడి వద్దకు వెళ్ళి, "నూకాలూ! నేను కవిత్వం రాశాను. నీకు వినిపించాలని వచ్చాను," అని తన గురక కవిత్వం వినిపించాడు.

అది విన్న నూకాలు మండిపడి, "రాత్రిపూట మాకు నిద్రపట్టకుండా నీ



పెళ్ళాం గురకతో చంపుతున్నదని మేం బాధపడుతూంటే, తెల్లవారకముందే నీ కవిత్వం ఒకటా? ఇంతకంటే నీ పెళ్ళాం గురక నయం. మరెన్నడూ నీ దిక్కుమా లిన కవిత్వం వినిపించకు," అన్నాడు.

కనకదాసు ముఖం చిన్నబోయింది. తన కవిత్వంఅర్థంచేసుకునేజ్ఞానం నూకాలుకు లేదనుకున్నాడు. ఆ సాయంత్రం రచ్చ బండ దగ్గరకు వెళ్ళేసరికి, ముసలి బడి పంతులురామప్ప కనిపించాడు. కనకదాసు ఆయనకు తనకవిత్వం వినిపించాడు. అది విన్న రామప్పకు గుండె దడదడలాడింది. ఆయన, "వీడికవిత్వంవీడూ మండిపోనూ!" అని మనసులో తిట్టుకున్నాడు; కానీ ఆమాట పైకిఅనలేదు. కారణం, ఆయన కనకదాసుకు కాస్తంత బాకీవున్నాడు.



రామప్ప చిన్నగా నవ్వేసి, "కనకదాసూ! విష్ణుశర్మ కవిత్వం ఏదో కొంచెం అర్థమైంది కానీ, నీది ఒక్క అక్షరంముక్క కూడా అర్థం కాలేదు. అంటే - విష్ణుశర్మది పామరులస్థాయి, నీది పండితులస్థాయి అన్న మాట. వెంటనే పోయి జమీందారుగారికి నీకవిత్వంవినిపించు. విష్ణుశర్మకు తొడిగినట్టే, నీకూ బంగారు కడియం తొడుగుతాడు," అన్నాడు.

కనకదాసు ఈ మాటలు నిజమని నమ్మి, పోయి జమీందారును కలిసి తన కవిత్వం వినిపించాడు. జమీందారు నవ్వుకుని, అతణ్ణి ఆట పట్టించాలనిపించి, "కనకదాసూ! ఇటువంటి కవిత్వం ఇంతవరకూ వినలేదు," అని ఒక శాలువా కప్పి, వందవరహాలు ఇచ్చి పంపాడు.

దానితో కనకదాసుకు తన కవిత్వం మీద నమ్మకం పెరిగింది. వారంపాటు పొలం వెళ్ళడం మానుకుని, గేదెలమీద, గిలకబావిమీద, ఊరకుక్కలమీద కవిత్వం రాశాడు. అది వినిపిస్తే రాజుగారు తప్పక మెచ్చుకుంటారని భావించి రాజధానిచేరి, రాజుగారి దర్శనం కోరాడు.

కోసలరాజు చంద్రకాంతుడు కళాప్రియుడు. అందునా, కవిత్వం అంటే చాలా ఇష్టం. ఇద్దరు సేవకులు మహారాజు వద్దకుపోయి, "ప్రభూ! కనకదాసనే రైతు తన కవిత్వం వినిపించడానికి వచ్చి, మీ దర్శనం కోరుతున్నాడు," అని చెప్పారు.

తన పాలనలో ఒక మామూలు రైతు కూడా కవిత్వం చెప్పడం, చంద్రకాంతుడికి సంతోషం కలిగించింది. ఆయన కనకదాసును నిండు సభకు పిలిపించి కవిత్వం వినిపించమన్నాడు. కనకదాసు మహోత్సాహంతో తన కవిత్వం వినిపించాడు. అది వింటూనే మహారాజుకు శిరోవేదన కలిగింది. సభలో చాలామంది చెవులు మూసుకున్నారు.

మహారాజు, కనకదాసుకేసి ఉరిమి చూసి, "మూర్ఖుడా! ఇంతగా మనసును కలవరపరిచే కవిత్వం, నేనేనాడూ వినలేదు. ఈ క్షుద్రపదాల కూర్పు కవిత్వంఅని ఎవరైనా మెచ్చుకున్నారా?" అని అడిగాడు.

కనకదాసు భయంతో బిక్కచచ్చి పోయి, "మహాప్రభో! మా ఊరి బడిపంతులు రామప్ప, నాది పండితులస్థాయి కవిత్వం అని మెచ్చుకున్నాడు. జమీందారుగారు ఇంతవరకూ ఇటువంటి కవిత్వం వినలే

దని స్వయానా శాలువా కప్పించారు," అన్నాడు.

అప్పుడు మహారాజు, "వీడు తప్పకమతి చలించినవాడై వుండాలి, విచారించండి. మతిస్థిమితం వున్నవాడే అయితే, ఇంతటి దుర్భరమైన కవిత్వం చెప్పినందుకు ఉరి తీయండి. అప్పటివరకూ ఖైదులో వుంచండి," అని భటులను ఆదేశించాడు.

భటులు, కనకదాసును ఖైదులోవుంచి, అతణ్ణి గురించి విచారించడానికి, కనకదాసు ఊరు వెళ్ళారు. కనకదాసుకువచ్చిన ప్రమాదం తెలుసుకున్న జమీందారు,తను వేళాకోళంగా అన్న మాటలునిజమనినమ్మి, అతడు ప్రాణాలమీదికి తెచ్చుకోవడంచూసి బాధపడ్డాడు. ఆయన భటులతో, "వాడికీ మధ్య కవిత్వం పిచ్చి పట్టుకుని మతి తప్పింది. మనిషి మహా మంచివాడు,"అని చెప్పాడు.

భటులు పోయి విషయం మహారాజు చెవిన వేశారు. మహారాజు కరుణించి కనకదాసును విడిచిపెట్టమని ఆజ్ఞాపించాడు. కనకదాసు ఖైదు నుంచి బయటపడి, మరెన్నడూ కవిత్వం జోలికి పోగూడదని ఒట్టుపెట్టుకున్నాడు.

అతడు ఊరుచేరిన వారంరోజులకు, ఒక అపరిచితుడు అతణ్ణి చూడవచ్చి, "మహా కవీశ్వరులకు అభివాదం!" అంటూ నమస్కారం పెట్టాడు.

ఆమాట వింటూనే కనకదాసు వణికిపోతూ, "నేను కవీశ్వరుణ్ణా! ఖైదునుంచి బయటపడ్డాక, మరి కవిత్వం జోలికిపోకూడదని ఒట్టుపెట్టుకున్నాను. ఇంతకూ నువ్వెవరు?" అని అడిగాడు. అపరిచితుడు నవ్వి, "నా పేరు నిశాచరణుడు. నేనొక భూతాలమాంత్రికుణ్ణి. కోసల రాజు సభలో నీకవిత్వం విన్నాను. నీ కవిత్వంతో డబ్బు గడించడానికి, తిరుగులేని ఉపాయం ఒకటి ఆలోచించాను," అన్నాడు.



కనకదాసు, "ఒకసారి డబ్బాశతో భంగపడి ఖైదుపాలయ్యాను. అలాంటి పొరబాటు మరిక చెయ్యను," అన్నాడు.

"ఈసారి అలాజరగదు.నమ్ము! నమ్ము!" అన్నాడు నిశాచరణుడు.

"సరే నాకవిత్వం ఎవరికి వినిపించాలి?" అని అనుమానంగా అడిగాడు కనకదాసు.

ఆసరికి చీకటి పడింది. "నాతో రా!" అంటూ నిశాచరణుడు, కనకదాసును శ్మశానానికి తీసుకుపోయాడు.

కనకదాసు భయంగా చుట్టూ కలయ చూస్తూ, "నేను కవిత్వం వినిపించవల సింది, శవాలకు కాదు గదా!" అన్నాడు.

"కానే కాదు. నువ్వు కవిత్వం వినిపించ వలసింది, పిశాచాలకు. నిజానికి మను ష్యులకంటే వాటికేకవిత్వం విలువతెలుసు. ఏదీ, గొంతెత్తి బిగ్గరగా నీ కవిత్వగానం ప్రారంభించు," అన్నాడు నిశాచరుడు.

కనకదాసు గట్టిగా కళ్ళు మూసుకుని, గానం ప్రారంభించాడు. కొద్ది క్షణాల్లో అక్కడికి పది పన్నెండు పిశాచాలు వచ్చి, శ్రద్ధగా వింటూ, మధ్య మధ్య గుసగుసలా డుకున్నాయి. కనకదాసు భార్య గురక మీద, గిలకబావి మీద, ఊరకుక్కలమీద రాసిన కవిత్వం వినిపించి, కళ్ళు తెరిచే సరికి చుట్టూ పిశాచాలు కనిపించాయి. అతడు భయంతో వణికిపోతూండగా అవి గట్టిగా చప్పట్లు కొట్టాయి.

కొన్ని పిశాచాలు పూలదండలు సృష్టించి, గాలిలో తేలుతూ వచ్చి కనకదాసు మెడలో వేశాయి. మరికొన్ని డబ్బు మూటలు, నగల మూటలు అతడి పాదాలముందు పడవేశాయి. దానితో అతడికి ధైర్యంవచ్చి మరొకసారి వాటికి తన కవిత్వం వినిపిం చాడు. పిశాచాలు తృప్తిగా తలలాడిస్తూ, చుట్టూవున్న చెట్లమీదికి ఎగిరిపోయాయి.

కనకదాసు డబ్బూ, నగలమూటలు పోగుచేస్తూండగా నిశాచరుడు, "డబ్బూ నగల్లో నాకు వాటా ఇవ్వడం ధర్మం అని పించుకుంటుంది, అవునా?" అన్నాడు.

"కాకేం, అవును!" అంటూ కనకదాసు సంతోషంగా నిశాచరుడికి సగం వాటా ఇచ్చి, "అవునూ! ఇంతకూ నా కవిత్వం పిశాచాలకు అంతగా నచ్చుతుందని ఎలా ఊహించావు?" అని అడిగాడు.

నిశాచరుడు నవ్వి, "నాకు పిశాచాల భాషతో కాస్త పరిచయముంది. రాజసభలో నీ కవిత్వం విన్నప్పుడు, అది పిశాచాల భాషకు దగ్గరగా వున్నదని గ్రహించాను. ఆ ఉద్దేశంతోనే నిన్నిక్కడికితీసుకువచ్చాను. నా ఆలోచన ఫలించింది," అన్నాడు.

తన కవిత్వం పిశాచాలభాషకు దగ్గరగా వున్నదన్న నిజం తెలిసి, కనకదాసు మరెన్నడూ కవిత్వం జోలికి పోలేదు. కవి త్వంతో డబ్బు సంపాయించాలన్న అతడి కోరిక మాత్రం తీరింది.





# అత్తగారూ-కొత్తకోడలూ

పోటుమెరక గ్రామంలో వుండే ఆండాళ్ళమ్మ కొడుకు రాజబాబు. అతడికి వివాహమై కొత్తకోడలు ఊర్మిళ కాపరానికొచ్చింది. ఊర్మిళ బాగా చదువుకున్నది. ఆండాళ్ళమ్మకు చదువు లేదు. కనీసం అక్షరాలు కూడా నేర్చుకోలేదామె. ఊర్మిళకు తాను బాగా చదువుకున్నదాని ననే అహంకారం. అత్త ఆండాళ్ళమ్మను లక్ష్య పెట్టేదికాదు.తనకు చదువురాదని ఆండాళ్ళమ్మకు కోడలి ముందు చిన్నతనంగా వుండేది. ఇద్దరూ ఎడమొహం పెడమొహంగా వుండసాగారు. రాజబాబుకు ఈ పరిస్థితి ఇబ్బందికరంగా పరిణమించింది.

ఒకనాడు ఆండాళ్ళమ్మకు ఒక ఉత్తరం వచ్చింది. అందులో, ఆమె దూరపుచుట్టం ఒకతను చనిపోతూ, లక్ష రూపాయల విలువైన ఆస్తిని ఆండాళ్ళమ్మ పేర రాసి పోయాడనీ, అయితే–ఆండాళ్ళమ్మ చదవడం, రాయడం నేర్చి, ఆ దస్తావేజులు చదవగలిగినప్పుడే, ఆస్తి ఆమె పరంచేయాలనే షరతుతో వీలునామా రాశాడనీ, చనిపోయినాయన స్నేహితుడు తెలియపరిచాడు.

లక్షరూపాయల విలువైనఆస్తి! ఆండాళ్ళమ్మకు చదువు రాదు! దీనికి పరిష్కారమేమిటి? రాజబాబు ఉత్తరం చదివితల్లికి వినిపించి, "అమ్మా, మనం పేదవాళ్ళమేం కాదు, పదెకరాల సుక్షేత్రమైన పొలం వున్నది. అయినా, అనుకోకుండా తనకు తానై వచ్చి తలుపు తట్టిన లక్ష్మిని కాదనడం అపచారమవుతుంది! నా మాటవిని చదువునేర్చుకో," అన్నాడు.

"ఈ వయసులో చదువా? నలుగురూ నవ్విపోగలరు!" అన్నది ఆండాళ్ళమ్మ.

"చదవారాయానేర్చుకోవడానికివయసుతో సంబంధంలేదు. నలుగురూ నవ్వడం

ఇంద్రగంటి నరసింహమూర్తి

కాదు, నిన్ను మరీ మరీ మెచ్చుకుంటారు. వచ్చే ఆస్తి వందా, రెండు వందలా- నిండు లక్షరూపాయలు. ఊర్మిళ నీకు చదువు నేర్పుతుంది. నా మాట కాదనకు!" అని నచ్చచెప్పాడు రాజబాబు.

ఆండాళ్ళమ్మ సరేనన్నట్టు తలూపింది. ఆస్తిమీదిఆశతో ఊర్మిళ, అత్తగారికి చదువు చెప్పడానికి సంతోషంగా ఒప్పుకున్నది.

రాజబాబు పలకా, బలపం తెచ్చియిచ్చాడు. ఇంటిపనులన్నీ అయ్యాక ఊర్మిళ, ఆండాళ్ళమ్మచేత అక్షరాలు దిద్దించసాగింది. నాలుగురోజులు గడిచేసరికి ఆండాళ్ళమ్మకు చదువు మీద శ్రద్ధ పెరిగింది.

మూడు నెలల్లోనే ఆండాళ్ళమ్మ మాటలు రాయడం నేర్చుకున్నది. ఐదు నెలల్లో పుస్తకం చదివే స్థాయికి చేరింది.

ఈ విధంగా, ఈఐదునెలల్లో అత్తా కోడళ్ళ మధ్య సాన్నిహిత్యం పెరిగింది. ఇంటి పనుల్లో అత్తకు ఊర్మిళ సహాయపడసాగింది. కోడలును గురువుగా అత్త భావించసాగింది. అత్తగారిలోని పట్టుదలకు కోడలు ముచ్చట పడింది. చదవడం బాగా వచ్చాక ఆండాళ్ళమ్మ ఒకనాడు కొడుకుతో ఆ దస్తావేజులేవో తెచ్చుకుందామన్నది. రాజబాబు చిన్నగా నవ్వుకుని, తల్లినీ, భార్యనూ ఒకచోట కూర్చోబెట్టి, "ఇద్దరూ శ్రద్ధగా వినండి! పరిస్థితులు అనుకూలిస్తే, ఏవయసులోనైనా చదువు నేర్చుకోవచ్చు. మీ ఇద్దరి మధ్యా వున్న విభేదాలు తొలగించాలనీ, మీకు సరి అయిన వ్యాపకం కల్పిస్తే సమస్య పరిష్కారమవుతుందనీ ఆలోచించి, ఆ ఉత్తరాన్ని నేనేసృష్టించాను. ఇద్దరూ ఇప్పట్లాగే అన్యోన్యంగా వుండండి!" అన్నాడు.

అది విన్న ఆండాళ్ళమ్మ ఆనందంగా, "మంచిపని చేశావురా, అబ్బాయీ! ఈ వయసులో హాయిగా భారత, భాగవతాలు చదువుకుంటూ కాలంగడుపుతాను. ఇంత పుణ్యం కూడా!" అన్నది.

ఊర్మిళ, అత్తగారికేసి ఆశ్చర్యంగాచూసి, భర్తతో, "నాకూ ఈ అనుభవంతో నలుగురికీ విద్య నేర్పగలనన్న నమ్మకం ఏర్పడింది. ఇరుగు పొరుగు పిల్లల్ని పోగుచేసి బడి నడుపుతాను. ఆ విధంగా నలుగురికీ మేలు చేసిన దాన్నవుతాను!" అన్నది ఉత్సాహంగా.






9

[అశోకుడు తండ్రి కోరిక ప్రకారం ఉజ్జయినికి బయలుదేరాడు. మార్గ మధ్యంలో విదిశాలోయలో విడిది చేశాడు. శాక్యనాయకుడి కుమార్తె విదీశతో పరిచయం ఏర్పడింది. అశోకుణ్ణి హత్యచేయడానికి సుశేముడు పంపిన ఇద్దరు నాట్యకత్తెలు – సమయానికి అటుకేసి విదీశ రావడంతో పట్టుబడ్డారు. అశోకుడు విదీశను వివాహమాడ కోరాడు. బౌద్ధ భిక్షువు ఉపగుప్తుడి అనుమతితో విదీశ, అశోకుణ్ణి వివాహమాడింది. —తరవాత]

క్షిప్రానదీ తీరంలో వెలసిన ఉజ్జయిని చాలా అందమైన నగరం. పాడిపంటలతో, వర్తక వ్యాపారాలతో ప్రజలు సుఖ సంతోషాలతో జీవిస్తున్నారు. యువరాజు అశోకుడు రాజ ప్రతినిధి పదవిని చేపట్టిన తరవాత, ప్రజలకు ఎటువంటి కొరతా లేకుండా పరిపాలనా వ్యవహారాలునిర్వర్తించసాగాడు.

ఆయన భార్య విదీశాదేవి తన దయా గుణంతోఅందరిగౌరవమన్ననలకూ పాత్రమయింది. ఐదేళ్ళలో రాజదంపతులకు ఒక కుమారుడు, ఒక కుమార్తె జన్మించారు. కుమారుడికి మహేంద్రుడనీ, కుమార్తెకు సంఘమిత్ర అనీ నామకరణం చేసి, అల్లారుముద్దుగా పెంచసాగారు.

ఉజ్జయినీ ప్రాంత విశేషాలను తెలియ చేయడానికి, యశుడు అశోకుడి ప్రత్యేక దూతగా రాజు బిందుసారుణ్ణి దర్శించడానికి రాజధాని పాటలీపుత్రానికి వెళ్ళాడు.

యశుణ్ణి చూడగానే రాజు ఆగ్రహంతో, "అశోకుడు ఎంతపని చేశాడు! నా అనుమతి పొందకుండా ఎవతెనో వివాహమాడడానికి అతడి కెంత ధైర్యం? తండ్రిని గౌరవించే తనయుడెవడైనా ఇటువంటి కృత్యంచేయ గలడా?" అని అడిగాడు.

"ప్రభువులు మన్నించాలి. యువరాజు అశోకుడు విదీశను వివాహమాడడానికి తమ అనుమతిని వేడుతూ ప్రత్యేక దూత ద్వారా ఒకలేఖను పంపాడు. ఆయనచేసిన మొట్టమొదటి పని అదే! అయినా ఆ లేఖ మీకు చేరకపోవడం ఆశ్చర్యంగా ఉన్నది. పైగా అనుమతిని తెలియజేస్తూ తమనుంచి ప్రత్యుత్తరం కూడా యువరాజు అశోకుడికి వచ్చింది. ఇందులో ఏదో తిర కాసు ఉన్నది!" అన్నాడు యశుడు వినయంగా.

రాజు బిందుసారుడు మౌనంగా తల పంకించాడు. యశుడు, యువరాజు అశో కుడి ప్రాణాలను విదీశ రెండుసార్లు ఎలా కాపాడిందో తెలియజేశాడు. ఆ తరవాత వారిరువురికీ కలిగిన పరిచయం, ఏర్పడిన అనురాగం గురించి చెప్పి, ప్రస్తుతం విదీశాదేవి యువరాజు అశోకుడికి ఎలా ఆదర్శపత్నిగా ఉంటున్నదో వివరించాడు.

రాజు అన్నిటినీఓర్పుగావిన్నాడు. భటు లను పిలిచి, యశుడు విడిదిచేయడానికి తగినఏర్పాట్లు చేయమని ఆజ్ఞాపించాడు.

ఆరోజు సాయంకాలం రాజు ప్రధాన మంత్రి ఖల్లాటకుణ్ణి పిలిపించాడు.

"మహామంత్రీ! నేను వ్యాధిగ్రస్తుణ్ణయి దాదాపు పదేళ్ళయింది.నేను ఎంతో కాలం



బతకననిపిస్తున్నది.అలాగని మరణిద్దా మన్నా భయంగానే ఉన్నది. నా సంకట పరిస్థితికికారణం ఏమిటోతెలుసా?" అని అడిగాడు రాజు.

"అంతమాత్రం గ్రహించలేకపోతే నేనిన్నాళ్ళు తమ సేవచేయడానికి అర్హుణ్ణి కాను, మహాప్రభూ!" అన్నాడు మంత్రి.

రాజు విచారంగా నవ్వి, "చంద్రగుప్త మౌర్యుడు స్థాపించిన సువిశాలసామ్రాజ్యం భవిష్యత్తును తలుచుకుంటే నాకు భయం కలుగుతున్నది. మరణ శయ్యపై వున్న రాజు పక్కన, కాబోయే రాజు ఉండడం అవసరం కదా. సుశేముణ్ణి తక్షశిల నుంచి పిలిపించు," అన్నాడు.

"చిత్తం ప్రభూ! అలాగే పిలిపిస్తాను. అయినా, తమరు మరింత కాలం జీవిం

TL-F3



చాలని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాము," అన్నాడు.

"సుశేముణ్ణి వెనక్కు పిలిపించడానికి కారణం ఏమిటో గ్రహించే ఉంటావు. దానితో నీకు అభిప్రాయభేదం లేదు కదా?" అని అడిగాడు రాజు.

ఆప్రశ్నకు మంత్రి వెంటనే సమాధానం చెప్పలేదు. కొంతసేపు మౌనం వహించి, "మహాప్రభూ! నా మనోగత అభిప్రాయం ఏమిటో తమకు తెలుసు. అయినాదానిని బహిర్గతం చేయడం నా బాధ్యత. దుర దృష్టవశాత్తు, యువరాజు సుశేముడు తక్షశిలకు వెళ్ళడం వల్ల మనకు మేలుకన్నా కీడే ఎక్కువ జరిగింది. యువరాజు సుశేముడు తిరుగుబాటుదారులను నిర్మూ లించడానికి బదులు, వాళ్ళ నాయకులకు లంచాలిచ్చి, పదవులిచ్చి లోబరచుకు న్నాడు. వాళ్ళు సాధారణ ప్రజలను మరింత వేధిస్తున్నారు. ఎదురు తిరిగిన వాళ్ళను కారాగారాలకు పంపుతున్నారు, చంపుతు న్నారు. యువరాజు ఆ దుండగులను ఆదరిస్తున్నాడు. ఆ విధంగా దుర్మార్గులైన మన శత్రువులు బలపడుతున్నారు. అమా యకులైన సాధారణ ప్రజలు నానాబాధలు అనుభవిస్తున్నారు. ఏక్షణంలో నైనా అక్కడ ప్రజల తిరుగుబాటు జరగవచ్చునని చారుల ద్వారా తెలియ వచ్చింది. మరొక విషయం ఏమంటే యువరాజు సదా సర్వవేళలా వినోదాలతో కాలక్షేపం చేస్తు న్నాడు. పరిపాలనా యంత్రాంగం సర్వ నాశనమైపోయింది?" అన్నాడు ఆవేశంగా.

"ఈ వార్తలు నాకూ అందాయి. కాని అవి అతిశయోక్తులయి ఉంటాయని భావించాను," అన్నాడు రాజు నిట్టూరుస్తూ.

"కాదు ప్రభూ! అవన్నీ పచ్చినిజాలు!" అన్నాడు మంత్రి.

"అంటే నా అనంతరం మగధ సింహా సనం అధిష్ఠించే అర్హత సుశేముడికిలేదనే కదా తమ అభిప్రాయం!" అన్నాడురాజు.

"అవును ప్రభూ! అవును. ముమ్మాటికీ అదే నా అభిప్రాయం," అన్నాడు మంత్రి.

"మరి సింహాసనాన్ని ఎవరికి అప్పగించ మంటావు?" అని అడిగాడు రాజు.

"యువరాజు అశోకుడికి సింహాసనాన్ని అధిరోహించే అర్హతలన్నీ ఉన్నాయి. తిరు గుబాటును అణచడంలోనూ, విశాలప్రాం తాన్ని పరిపాలించడంలోనూ తన సామ ర్థ్యాన్నీ, దక్షతనూ ఆయన స్పష్టంగా నిరూపించుకున్నాడు!" అన్నాడు మంత్రి.

రాజు కొంతసేపు మౌనం వహించి, "ఖల్లాటకా! నేనీ విషయంలో నిర్ణయం తీసుకోలేకుండా ఉన్నాను," అన్నాడు.

"ప్రభూ! విశ్రాంతి తీసుకోండి. అవసర మైనప్పుడు సరైన నిర్ణయం తీసుకో వచ్చు!" అని చెప్పి మంత్రి రాజుకు నమస్కరించి అక్కడినుంచి బయలుదేరాడు.

ఒక గంటసేపట్లో మంత్రికి రాజభవనం నుంచి మళ్ళీ పిలుపు వచ్చింది. ఇప్పుడు పిలిపించింది రాజు కాదు; రాజుగారి పెద్ద భార్య. మంత్రి రాజమందిరానికి వెళ్ళేలోగా రాజుగారి శయ్యసమీపంలో రాజవైద్యులూ, రాజపురోహితుడూ, పెద్దరాణీ ఉన్నారు.

మంత్రిని చూడగానే మహారాణి, "రాజు గారు ఉన్నట్టుండి గుండె పట్టుకుని,స్పృహ తప్పి పడిపోయారు," అని కొంతసేపు ఆగి, "మహామంత్రీ! యువరాజు సుశేముణ్ణి వెంటనే పిలిపించాలి," అన్నది.

"చిత్తం, మహారాణీ!" అన్నాడు మంత్రి.

"ఇప్పుడే దూతలను పంపగలవా?" అని అడిగింది మహారాణి.

"ఒక్క గంటలో సిద్ధం చేస్తాను, మహా రాణీ! అన్నాడు మంత్రి.

"మంచిది. ఈలోగా నా కుమారుడికి నేనొక లేఖ రాస్తాను. భటులను దానిని తీసుకువెళ్ళమనిచెప్పు," అని అక్కడినుంచి హడావుడిగా లోపలికి వెళ్ళింది మహారాణి.

మంత్రి వైద్యుడి కేసి తిరిగి, "రాజుగారి పరిస్థితి ఇప్పుడెలా ఉన్నది?" అని అడి గాడు ఆతృతగా. "మహారాజు రేపు సూర్యో దయం చూడ గలిగితే గొప్ప అద్భుతం జరిగినట్టే!" అన్నాడు రాజవైద్యుడు.



"ఎలాగైనా రాజుగారి ప్రాణాలు నిల బెట్టడానికి ప్రయత్నించండి. నా సహాయం ఏదైనా అవసరమైతే కబురు చేయండి, వస్తాను," అంటూ అక్కడి నుంచి బయలు దేరాడు మంత్రి.

అక్కడే వున్న రాజపురోహితుడు కూడా మంత్రి వెంట నడిచాడు. మంత్రి ద్వారం వద్ద నిలబడిన భటుణ్ణి పిలిచి, "మేము రహస్యాలోచనా మందిరంలో ఉంటాము. సేనాధిపతిని అక్కడికి రమ్మను," అని ఆజ్ఞాపించి వేగంగా ముందుకు నడి చాడు.

* * *

యశుడు సుభద్రాదేవి భవనంలో ప్రవేశించి ఆమెకు చేతులు జోడించి, "తల్లీ! యువరాజు అశోకుడు ఉజ్జయినీ నగరం



నుంచి పంపగావచ్చాను.నాపేరుయశుడు," అన్నాడు వినయంగా.

"అలాగా నాయనా! నా బిడ్డ అశోకుణ్ణి చూసి ఎన్నేళ్ళయింది? నా బిడ్డ క్షేమంగా ఉన్నాడా?" అని అడిగింది సుభద్ర.

"యువరాజు క్షేమంగా ఉన్నాడు తల్లీ! అంతేకాదు; దేవత వంటి విదీశాదేవిని వివాహమాడాడు. వాళ్ళకు బంగారంలాంటి ఇద్దరు పిల్లలు కూడా పుట్టారు. వాళ్ళను చూస్తే తమరు పొంగిపోగలరు," అన్నాడు యశుడు సంతోషంగా.

"నాకూ ఉజ్జయినికి రావాలనే ఉన్నది నాయనా! కాని మహారాజుకు ఆరోగ్యం బాగాలేదు. ఈ స్థితిలో బయలుదేరలేను కదా!" అంటూ సుభద్రాదేవి ఆగింది. ఆమెను రమ్మన్నట్టు పరిచారిక సైగ చేయడంతో, లోపలికి వెళ్ళి వెంటనే ఆందోళనతో తిరిగి వచ్చి "రాజుగారి పరిస్థితి ఆందోళనకరంగా ఉందట. ఈ రాత్రి గడవడమే కష్టం అంటున్నారు," అన్నది గద్గదస్వరంతో.

"అలాగా!" అంటూ అక్కడి నుంచి బయలుదేరబోయాడు యశుడు.

"నాయనా! రాజుగారు ఉన్నంతవరకు ఫరవాలేదు. ఒకవేళ జరగకూడనిది జరిగి పోతే మాత్రం నాకీ భవనం నరకమే అవుతుంది. యువరాజు సుశేముడి పట్ల నేనెంత మాతృ ప్రేమ కనబరచినా అతడు నన్ను ద్వేషిస్తూనే ఉన్నాడు. అతని తల్లి పట్టపురాణి నన్ను కళ్ళతో చూడలేకపోతు న్నది. నాయనా, నువ్వు ఇక్కడే కొన్నా ళ్ళుండాలి. జరగకూడనిది జరిగితే నేను నీతో ఉజ్జయినికి వస్తాను," అన్నది సుభద్రారాణి సజలనయనాలతో.

"తల్లీ నువ్వేమీ భయపడనవసరంలేదు. మిగిలిన రాణులందరూ నిన్నుచూసి భయ పడి, రాజమాతవని గౌరవించే రోజులు అట్టే దూరంలో లేవు!" అన్నాడు యశుడు.

సుభద్రాదేవిఏమీమాట్లాడలేకపోయింది. దిగ్భ్రాంతితో చూస్తూ ఉండిపోయింది.

"ఓర్పు వహించు తల్లీ! ఉత్తముడైన తమ తనయుడికోసం నా సేవలు అందిం చవలసిన తరుణం ఆసన్నమయింది. ఈ సామ్రాజ్యం భవిష్యత్తు మరికొన్ని రోజుల లోనే నిర్ణయమవుతుంది. నేను నిన్ను మాటిమాటికీ దర్శించలేను. రాజభవ నంలో జరిగే విషయాలను విశ్వాసపా త్రులైన పరిచారికలద్వారా అప్పటికప్పుడు

నాకు తెలియచేశారంటే చాలు. మిగతా విషయాలు నేను చూసుకుంటాను. నన్ను ఆశీర్వదించుతల్లీ," అంటూ యశుడు సుభద్రాదేవి పాదాలకు నమస్కరించి అక్కడి నుంచి బయలుదేరాడు.

* * *

రహస్యాలోచనా మందిరంలో మంత్రిని చూడవచ్చిన సేనాధిపతి, "మహామంత్రీ! సుశేముడు రాజ్యసింహాసనాన్ని అధిష్ఠించడం నాకు వ్యక్తిగతంగా సమ్మతంకాదు. కాని సేనాధిపతిగా, సింహాసనానికి పోటీ అన్నప్పుడు రాజుగారి జ్యేష్ఠకుమారుడికి పట్టం కట్టడం నాబాధ్యతగా భావిస్తున్నాను," అన్నాడు.

"మీ రాజభక్తికీ, కర్తవ్య నిర్వహణలో మీరు చూపుతూన్న శ్రద్ధకూ జోహార్లు!" అన్నాడు మంత్రి.

"కృతజ్ఞతలు మిత్రమా!" అన్నాడు సేనాధిపతి.

"అయితే, ఇక్కడ ఒకవిషయం గుర్తుంచుకోవాలి. మగధ సింహాసనానికి సంబంధించినంతవరకు రాజపురోహితుడిదే నిర్ణాయకపాత్ర. మౌర్యసామ్రాజ్య స్థాపనకు మూలకారకుడైన చాణక్యుడు మొదట రాజపురోహితుడు; ఆ తరవాతే మంత్రిఅన్న విషయం మనం మరిచి పోకూడదు," అన్నాడు మంత్రి.

"అంటేమీఉద్దేశం?"అన్నాడుసేనాధిపతి.

మంత్రి, పక్కనే కూర్చున్న రాజపురోహితుడికేసి చూశాడు.

"నేను రాజుగారికుమారులందరి జాతకాలనూ పరిశీలించాను. అశోకుడికి ఒక్క



డికే చక్రవర్తి అయ్యే అర్హతలున్నాయి. సుశేముడు సామ్రాజ్య విచ్ఛిత్తికి కారకుడవుతాడు!" అన్నాడు రాజపురోహితుడు.

"అలాగా! అయితే, తమఇష్టానుసారమే కానివ్వండి," అన్నాడు సేనాధిపతి.

"చాలా సంతోషం! అశోకుడంటే నాకు అభిమానంలేదు. కాని సామ్రాజ్య పరిరక్షణకుఇలాచేయకతప్పదు!"అన్నాడుమంత్రి.

"నిజమే! ఆ విషయం నాకూ తెలుసు. అయినా, సేనాధిపతిగా ఇక్కడి విషయం తెలియజేస్తూ తక్షశిలకూ, ఉజ్జయినికీ దూతలను పంపడం నా కర్తవ్యం. వారిరువురిలో ఎవరుముందుగా ఇక్కడికివస్తారన్న దాన్నిబట్టి మిగిలినవిషయాలు ఆధారపడి ఉంటాయి!" అన్నాడు సేనాధిపతి.

* * *

మసక చీకటి ఆవరించిన గదిలో యశుడు, "ఇక్కడికి ముందుగా ఎవరు వస్తారన్న దాన్ని బట్టి మిగిలిన విషయాలు ఆధారపడి ఉంటాయి!" అన్నాడు ఇద్దరు నాట్యకత్తెలతో.

ఐదేళ్ళ క్రితం అశోకుణ్ణి హతమార్చడానికి వెళ్ళిన నాట్యకత్తెలే వాళ్ళు. అశోకుడు ప్రాణభిక్ష పెట్టడం వల్ల వాళ్ళు ఇన్నాళ్ళు విదీశాదేవికి పరిచారికలుగా ఉండి ఇప్పుడే పాటలీపుత్రానికి వచ్చారు.

"మేమేం చేయాలో చెప్పండి?" అని అడిగారు నాట్యకత్తెలు.

"యువరాజు అశోకుడు మీకు ప్రాణభిక్ష పెట్టాడు కదా. దానికిప్పుడు ప్రత్యుపకారం చేయాలి!" అన్నాడు యశుడు.

"ఇప్పుడు మేము చేయవలసనదేదో సూటిగా చెప్పండి," అన్నది ఒక నాట్యకత్తె.

"మీరు సుశేముడి ప్రయాణాన్ని జాప్యం చేసి, అతడు ఆలస్యంగా ఇక్కడికి చేరేలా చూడాలి. మీకు గుర్రపుస్వారీ వచ్చుకదా? మీకోసం రెండు ఉత్తమ అశ్వాలనూ, మరిద్దరు రక్షకులనూ సిద్ధంగా ఉంచాను. వాళ్ళకు తక్షశిలకు దగ్గరి అడ్డుదారి తెలుసు. మీరు ఆ మార్గంగుండా వెళ్ళి, రాజదూతలకు ముందే తక్షశిల చేరుకోవాలి. దూతలు రేపు ఉదయమే బయలుదేరనున్నారు. మీరు ఈ రాత్రే బయలుదేరాలి," అన్నాడు యశుడు.

"ఈ రాత్రేనా! బయట సన్నగా వానకురుస్తున్నది," అన్నది ఒక నాట్యకత్తె.

"యువరాజు అశోకుడు చక్రవర్తి అయినట్టయితే, మీ జీవితమంతా బంగారు వాన కురుస్తుంది!" అన్నాడు యశుడు నవ్వుతూ.

"మేము సుశేముణ్ణి మోసగించామని విదీశాదేవికి తెలిస్తే ఆమె హర్షించదు. అయినా మేము అశోకుడి ఋణం తీర్చుకోవాలి!" అన్నారు నాట్యకత్తెలు.

"అంతేకాదు. ఇన్నాళ్ళు సన్యాసినుల్లా జీవించారు. ఇప్పుడు మీ సహజ సామర్థ్యం ప్రదర్శించడానికి అవకాశం లభించింది కదా!" అన్నాడు యశుడు చిన్నగా నవ్వుతూ.

"అది మా గత నైజం. ఇప్పుడు మారిపోయాం. అయినా మా గతశక్తి సామర్థ్యాలు ఏ స్థితిలో ఉన్నాయో పరీక్షిద్దాం," అన్నారు నాట్యకత్తెలు నవ్వుతూ. – (ఇంకావుంది)






# వ్యవహారశాస్త్రం!

పట్టుదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, అర్ధరాత్రి వేళ, భీతిగొలిపే ఈ శ్మశానంలో ఎన్నో ఇక్కట్లకు గురవుతున్నా వీడని నీపట్టుదలచూస్తూంటే, నువ్వు రాజనీతితో పాటు ఇతర శాస్త్రాలు కూడా చదివిన వాడివేమోనన్న అనుమానం కలుగు తున్నది. ఎందుకంటే – ఎన్ని శాస్త్రాలు చదివినా వ్యవహారజ్ఞానం కొదువ అయినవాడు తప్పక నవ్వులపాలవుతాడు. నీకున్న వ్యవహారశాస్త్రజ్ఞానం ఏపాటిదో నాకు తెలియదు. వికాసుడు – విశాఖుడు అనే ఇద్దరు శాస్త్రజ్ఞులు, తమ దగ్గరకు వచ్చే వారికి ఎంతో భిన్నమైన రీతిలోసలహా లిస్తూండేవారు. వారిలో ఎవడు నిజమైన శాస్త్రజ్ఞానో,ఎవడుకాదోగ్రహించడం సామా

## బేతాళ కథలు



న్యులకు అసాధ్యం. నీకు ఆ శాస్త్రజ్ఞులకథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

విలాసపురంలో వికాసుడనే భాగ్యవంతు డుండేవాడు. తలిదండ్రులిచ్చిన ఆస్తి బాగావుండడంచేత, ఆయన ఏపని చేయ కపోయినా సుఖంగా గడిచిపోతున్నది.కానీ వికాసుడంతటితో తృప్తిపడక శాస్త్రపఠనం చేయసాగాడు. అవి కొంత అర్థమై కొంత అర్థం కాకుండా వుంటే– పండితులను సంప్రదించి సందేహాలు తీర్చుకునేవాడు.

కొంతకాలానికి వికాసుడికి శాస్త్రజ్ఞానం బాగా ఒంటబట్టింది. దాంతో ఆయనకు తన చుట్టుపక్కల వున్నవారందరూ తెలివి హీనులుగా కనిపించసాగారు. వాళ్ళేపని చేసినా ఏదో చిన్నలోపం వుండేది. అది చెబితే వాళ్ళకు కోపం వచ్చేది. చెప్పకుండా వూరుకుందామా అంటే – తెలిసికూడా, ఎదుటివాడు తప్పుచేస్తూంటే శాస్త్రజ్ఞానం ఒప్పుకుంటుందా?

వికాసుడు బాగా వున్నవాడు కదా అని ఒకప్పుడు చాలామంది ఆయన వద్దకు సలహాలకూ, సంప్రదింపులకూ వచ్చేవారు. సలహాలతో పాటు అంతో ఇంతో ధన సహాయం చేయకపోతాడా అని వారిఆశ. దానికి తోడు వికాసుడి సలహాలు కూడా బాగానే వుండేవి – ఆయనకు శాస్త్రజ్ఞానం లభించేవరకూ!

ఒకసారి వీరయ్య అనేవాడు ఆయన వద్దకు వచ్చి, "అయ్యా! నా కూతురుకు పెళ్ళి కుదిరింది. ఆర్నెల్ల తర్వాత పెళ్ళి జరిపిద్దామన్నాను. అప్పటికి నాకు రావల సిన సొమ్మంతా దగ్గర చేరుతుంది. కానీ వరుడి తరఫువారు మూడువారాల్లో పెళ్ళి జరిపించమంటున్నారు. పెళ్ళికి అయిదు వేల వరహాలు కావాలి. నా దగ్గర రెండువేలే వున్నాయి. ఇలాంటి సందర్భంలో ఎవర్నీ నొప్పించకుండా పెళ్ళెలా జరిపించేది?" అంటూ సలహా అడిగాడు.

వికాసుడు వెంటనే, "నీకు తెలియదా? ఆర్నెల్లదాకా పెళ్ళి ముహుర్తాలు లేవని శాస్త్రం చెబుతున్నది. ఆ విషయం పెళ్ళి వారికి చెప్పు," అన్నాడు.

"అయ్యా! ఆ విషయం పెళ్ళివారికీ తెలుసు. కానీ ఆ ఇంట్లో ఒక ముసలాయన మనవడి పెళ్ళి చూడాలని తహతహలాడు తున్నాడట. ముహూర్తం మంచిది కాకపోతే తర్వాత శాంతి చేసుకుంటారట. ఇప్పుడు

మాత్రం ఈ పెళ్ళి జరిగితీరాలంటున్నారు," అన్నాడు వీరయ్య.

"శాంతుల్ని శాస్త్రం ఒప్పదు. ఈ విషయం మగపెళ్ళివారికి చెప్పు. లేదా ఈ సంబంధం వదులుకో," అన్నాడు వికాసుడు.

"అబ్బాయి అందగాడు, ఆస్తిపరుడు, గుణవంతుడు. ఇలాంటి సంబంధంమళ్ళీ నాకు దొరుకుతుందనిపించదు. మంచి ముహూర్తం కంటే, మంచి సంబంధమే ముఖ్యం. నేను వాళ్ళడిగినట్టే పెళ్ళి జరిపించాలనుకుంటున్నాను. తమరు నాకు ధన సహాయం చేయగలరా?" అని వీరయ్య సూటిగా అడిగేశాడు.

"ఛీ, శాస్త్రాన్ని పాటించకుండా కూతురి పెళ్ళి చేసే నువ్వేం తండ్రివి? నీలాంటి వాడికి నేను మాత్రం సాయం చెయ్యను గాక చెయ్యను," అన్నాడు వికాసుడు.

"అయ్యా! చిత్రపురం విశాఖులవారు తమకంటే శాస్త్రజ్ఞానం కలవారు. కన్న కూతురి సుఖం కోసం శాస్త్రాన్ని కూడా ఎదిరించగల నా ధైర్యాన్నాయన మెచ్చుకున్నారు. తమరిలాగనడం ఆశ్చర్యంగా వుంది," అని చిన్నబుచ్చుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు వీరయ్య.

తన సలహాను తప్పు పట్టినందుకు వికాసుడు నొచ్చుకున్నాడు. అంతలో రవిచంద్రుడనే అతను, ఆయనదగ్గరకొచ్చాడు. అతనొక ఇల్లు కొందామనుకుంటూండగా, ఊరు చివర చక్కని ఇల్లొకటి బేరానికొచ్చింది. ధర ఎంతో లేదు. స్థలం పెద్దది. అయితే, పెరటినిండా కొబ్బరిచెట్లున్నాయి. కొబ్బరి చెట్లు రవిచంద్రుడి కుటుంబానికి




అచ్చిరావు. పెరట్లోకొబ్బరిమొక్కలు నాటించగానే అతడి తాతచనిపోయాడట. తండ్రి కూడా జబ్బుపడితే ఆ మొక్కలు పీకించి వేయగానే నయమయిందట. ఇప్పుడు రవిచంద్రుడి తండ్రికి ఆరోగ్యమంతబాగా లేదు. అందుకని, ఆ ఇల్లు కొనాలంటే భయపడుతున్నాడు!

వికాసుడు నవ్వి, "మంచి ముహూర్తం చూసుకుని ఇల్లుకొనుక్కో . పెరట్లోని కొబ్బరిచెట్లు ఏకుటుంబానికీ హానిచేయవని శాస్త్రంచెబుతున్నది. మీనాన్న జబ్బుకు కొబ్బరినీళ్ళు మంచివి. మూఢనమ్మకాలతో మంచిఅవకాశంజారవిడుచుకోకు,"అన్నాడు.

రవిచంద్రుడు తల అడ్డంగా ఊపి, "ఆఇల్లుముందుగా మీరు కొనండి. పెరట్లో. కొబ్బరిచెట్లన్నీ నరికించండి. అప్పుడు



నేను మీ నుంచి కొనుక్కుంటాను. ఈపని ఇంటి యజమానినే చెయ్యమన్నాను. కానీ తన చేత్తో పెంచిన చెట్లను నరకడానికి చేతులు రావడంలేదని, ఆయన ఒప్పుకోలేదు," అన్నాడు.

"కాయలిచ్చే కల్పతరువును నరకమనే నువ్వేం మనిషివి? ఆ ఇంటాయన బాగా చెప్పాడు. నీలాంటి మూర్ఖుడికి నేనుసహకరించను," అని చెప్పేశాడు వికాసుడు.

"నన్ను మూర్ఖుడని మీరే అన్నారు. చిత్రపురంలోని విశాఖుడు, నా గోడువిని, నా పితృభక్తిని ఎంతో పొగిడాడు," అని రవి చంద్రుడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఈ విధంగా, మరికొందరినోట చిత్రపురంలోని విశాఖుడి పేరు విన్న వికాసుడికి, ఆయన్ను గురించి కుతూహలం కలిగింది. శాస్త్రజ్ఞానంతో తను విమర్శించిన వారినందర్నీ ఆయన మెచ్చుకున్నట్లే కనబడింది. ఒకవేళ అందర్నీ మెచ్చుకోవడమే ఆయన పనా? లేక ఆయన శాస్త్రజ్ఞానం వేరే వున్నదా? ప్రతివాడూ ఆయన శాస్త్రజ్ఞానాన్ని మెచ్చుకుంటున్నాడు కూడా!

ఇలా ఆలోచించి, వికాసుడు చిత్రపురం వెళ్ళాలనే అనుకున్నాడు కానీ, ఈలోగా తన శాస్త్రజ్ఞానం గురించి కూడా కొంత అభిప్రాయసేకరణ అవసరం అనిపించింది. ఆ సమయంలో అనుకోకుండా ఒక యోగి ఆయన ఇంటికి వచ్చాడు.

వికాసుడు, యోగికి సకల మర్యాదలూ చేసి, "స్వామీ! నేను ఎన్నో శాస్త్రాలుచదివి ఎంతో జ్ఞానం సంపాయించాను. తమరు నా శాస్త్రజ్ఞానం ఏ స్థాయికి చేరుకున్నదీ చెప్పాలి!" అన్నాడు.

"శాస్త్రజ్ఞానం తెలివిని పెంచడానికేతప్ప, దానికి స్థాయీ భేదముండదు, నాయనా! శాస్త్రజ్ఞానం అనేది అపారం. నువ్వు స్థాయిని గురించి అడగడానికి కారణం చెప్పు!" అన్నాడు యోగి.

"నా కున్న శాస్త్రజ్ఞానంతో ఇతరులకు సాయపడాలని ప్రయత్నిస్తూంటే, ఒక్కరికీ నా మాటలు నచ్చడం లేదు," అంటూ వికాసుడు తన అనుభవాలు చెప్పాడు.

యోగి నవ్వి, "అన్ని శాస్త్రాల్లోకీ మనిషి జీవితాన్ని శాసించేది వ్యవహారశాస్త్రం మాత్రమే! అది ఒక్కొక్కరికి ఒక్కో పద్ధతిలో వుంటుంది. శాస్త్రజ్ఞానంతో నీ తెలివిని పెంచుకుని వ్యవహరించు. ఇతరులు నీ వద్దకు సాయం కోసం వస్తే, వారి అవస

రాలు తీర్చాలి తప్ప సలహాలివ్వకూడదని వ్యవహారశాస్త్రం చెబుతున్నది," అన్నాడు.

"మూర్ఖుల అవసరాలు తీర్చడానికి శాస్త్రం తెలిసినవారికి మనసొప్పదు. అటు వంటప్పుడు సలహాలివ్వక తప్పదు కదా!" అన్నాడు వికాసుడు.

యోగి చిటికవేసినవ్వుతూ, "సాయపడ లేని మనిషిని పొగడ్తలతో ముంచెత్తమని వ్యవహారశాస్త్రం ఆదేశిస్తున్నది!" అన్నాడు.

వికాసుడు, యోగికేసి అనుమానంగా చూస్తూ, "స్వామీ! మూర్ఖుడిని పొగడ్తలతో ముంచెత్తడం అసత్య ప్రలాపమే అవుతుంది. శాస్త్రం తెలిసిన వారాపనిచేయ లేరు," అన్నాడు.

ఆ మాటలకు యోగి కాస్త అసమ్మతిగా తలాడించి, "అయితే విను! శాస్త్ర సమ్మతంగా మూర్ఖుణ్ణి పొగిడే విధానం తెలుసుకోవాలంటే, చిత్రపురంలోని విశాఖుణ్ణి కలుసుకోవాలి. వ్యవహారశాస్త్రం ఒకరు చెబితే తెలుసుకునేది కాదు కాబట్టి, నీవాయనను శ్రద్ధగా గమనించి అసలు విషయం అవగాహన చేసుకోగలగాలి," అన్నాడు.

యోగినోట కూడా విశాఖుడి పేరు విన్నాక, ఇక జాప్యంచేయదల్చుకోలేదు వికాసుడు. ఆయన మర్నాడే బయల్దేరి చిత్రపురం వెళ్ళాడు.

ఆ ఊళ్ళో విశాఖుడిది చాలా విశాలమైన భవంతి. ఒక పెద్దగదిలో నేలమీద తివాసీ పరిచి వుంచారు. గది మధ్యలో విశాఖుడు కూర్చుని వున్నాడు. ఆయన ముఖం జ్ఞానంతో వెలిగిపోతున్నది. పక్కన దేవదత్తు



డనే పదహారేళ్ళ యువకుడున్నాడు. అతడి కుడిచేతిలో మురళివున్నది. ఒడిలో పుస్తకమొకటి వున్నది. ఎదురుగా పెద్దపలక వున్నది. దానిపక్కన ఒక సుద్దముక్కవున్నది.

విశాఖుడి ముందు కొంచెందూరంలో చాలామంది కూర్చుని వున్నారు.

వికాసుడక్కడికి చేరిన సమయంలో ఒక కవి, విశాఖుడితో, "ప్రకృతి శక్తులే మనిషి జీవితాన్ని శాసిస్తున్నవి. అవే మనకు వరాలిస్తున్నవి. అందుకే నేను, నా కవిత్వాన్ని నిండుపున్నమి వెన్నెలకూ, గలగలపారే సెలయేటికీ, వికసిత పుష్పాలకూ వినిపిస్తున్నాను. కానీ ఇంతవరకూ నాకెలాంటి ఫలితంకనబడలేదు," అన్నాడు.

విశాఖుడు వెంటనే దేవదత్తుడి వంక చూసి, "నాయనా! నీ పుస్తకంలోని ఒక



మంచి పద్యం చదివి వినిపించు నాలో ప్రేరణ కలుగుతుంది," అన్నాడు.

అప్పుడు దేవదత్తుడు తను రాసిన పద్యం చదివాడు. అది అర్థరహితంగా, భావరహితంగా వున్నది. విశాఖుడు మాత్రం అది వింటూనే, "ఆహాఁ, ఎంత చక్కగా చెప్పావు, నాయనా! దైవాంశ సంభూతుడివి. అందుకే నీ పేరు దేవదత్తుడయింది," అంటూ దేవదత్తుణ్ణి మెచ్చుకుని, కవితో, "అయ్యా! ప్రకృతిమాతకు కవిత్వం వినిపించాలనుకునే మీ వంటి వారి దర్శనంనాకు లభించింది. ధన్యుడినయ్యాను. మీరనే ప్రతిఫలం గురించి చెప్పడానికి నేనెంత వాణ్ణి?" అన్నాడు.

కవి సంతోషంగా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. అప్పుడొక రైతు విశాఖుడితో, "అయ్యా! ప్రతి ఏటా పంటలు సమృద్ధిగా పండి, నాగాదెలు నిండిపోతున్నవి. అయితే ధాన్యం ధర తరచుగా పెరుగుతుండడం వల్ల, నేను చూస్తూచూస్తూ ధాన్యం అమ్మలేకపోతున్నాను. ఎప్పటికీ నష్టమనిపించని విధంగా, నా ధాన్యాన్ని నేనెప్పటికి అమ్ముకోగలనో తెలియడంలేదు," అన్నాడు.

అప్పుడు విశాఖుడు, దేవదత్తుడి వంక చూసి, "నాయనా! నాలో ప్రేరణ కలగడానికి, ఈరైతు బొమ్మను పలకమీదగీయి," అన్నాడు.

దేవదత్తుడు సుద్దముక్కతో పిచ్చిగీతల్లాంటివి పలకమీద గీయగానే, "ఆహాఁ, ఉన్న బొమ్మనెవరైనా గీస్తారు. రైతు మనసులోని గజిబిజిని ఎంత చక్కగా చిత్రీకరించావు, నాయనా! ఇది నీకేసాధ్యంకావాలి మరి!" అని క్షణంసేపు కళ్ళు మూసుకుని తెరిచి, రైతుకేసి చూస్తూ, "కరువు రోజులు వస్తే ధాన్యం ధరలు మరీ పెరిగిపోతాయి. పొరుగు దేశాలనుంచి ధాన్యం దిగుమతి చేసుకుంటే, మన బంగారమంతా అక్కడికి చేరుతుంది. అలా జరక్కుండా ధాన్యం నిలవచేస్తున్నావు. బంగారం నీ దగ్గరుంటేనేం, రాజుగారి దగ్గరుంటేనేం– మన దేశంలోనే వుంటుంది కదా! ఇంత గొప్పవాడివి, నీకు నేనేం చెప్పగలను, నాయనా; నీ దర్శనమైనందుకు సంతోషించడం తప్ప!" అన్నాడు విశాఖుడు.

రైతు సంతోషంగా అక్కడి నుంచి వెళ్ళిపోగానే, ఒక స్త్రీ లేచి నిలబడి, "మహానుభావా! నేను నా బిడ్డలు తప్పు చేసినా క్షమిస్తాను. ఎంతటి సమర్థులైనా,

ఇతరులు నా బిడ్డలకంటే అధికులుగా వుంటేచూడలేను. నేనుసంతోషంగా వుండా లంటే ఏం చేయాలి?" అని అడిగింది.

విశాఖుడు దేవదత్తుణ్ణి ఒకసారి మురళి వాయించమని చెప్పి, వాడు అపస్వరాలు పలికిస్తూంటే, "ఓహోఁ, నాద బ్రహ్మలు పలికించలేని సంగీతవిద్య నీకెలా అబ్బిం దిరా? అయినా దైవాంశ సంభూతుడివి, ఇది నీకు అబ్బడంలో ఆశ్చర్యమేముం దిలే?" అని మెచ్చుకుని, ఆ స్త్రీ వైపు తిరిగి, "అమ్మా! ఈ ప్రపంచమంతా స్త్రీ స్వార్థం మూలంగానే పవిత్రమైంది. కన్న బిడ్డల తప్పులు క్షమించడం, అందరికంటే వారే గొప్పగా వుండాలనుకోవడం, ప్రతి తల్లీ కోరేదే. కానీ నీలా నిజాన్ని నిజంగా చెప్పగల స్త్రీమూర్తులు అరుదు. నీలోని మాతృమూర్తికీ, సత్య సంధతకూ నా నమస్సులు," అన్నాడు.

వికాసుడిక వినలేకపోయాడు. విశాఖుడి లాంటి వాడి చుట్టూ చేరి జనం ఎలా ప్రయోజనం పొందుతున్నారో ఆయనకు అర్థం కాలేదు. ఈ విషయమై యోగిని నిలదీయాలని, తన గ్రామానికి బయలు దేరాడు. అయితే, యోగిగ్రామంపొలిమేర లోనే ఆయనకు ఎదురయ్యాడు.

వికాసుడు, యోగికి తను విన్నదంతా చెప్పి, "స్వామీ! ఆ విశాఖుణ్ణి గురించి జనం అంత గొప్పగా ఎందుకు చెప్పుకుం టున్నారో అర్థం కావడం లేదు. అతడికి ఏ శాస్త్ర జ్ఞానమూ వున్నట్టులేదు. అధ్య యనం చేయవలసిన ఆరు శాస్త్రాలమాట అలావుంచి వాటిలో కనీసం తర్క, వ్యాక



రణ శాస్త్రాలపేరైనా విని వుంటాడా అన్న అనుమానం కలుగుతున్నది!" అన్నాడు.

అందుకు యోగి పెద్దగా నవ్వి, "నాయనా! నా అభిప్రాయంలో, ఆ విశా ఖుడు నువ్వనే శాస్త్రాలతోపాటు వ్యవహార శాస్త్రం కూడా చదివి వుంటాడు! ఇంటికి వెళ్ళాక దానికోసం గట్టి ప్రయత్నం చెయ్యి. సంవత్సరం ముగియకుండానే, నీ ఇంటికి మరొకసారివచ్చి, నీ సాయం కోరివచ్చే వాళ్ళకు, నువ్వెలాంటి సలహాలిస్తావో గమ నిస్తాను," అంటూముందుకుసాగిపోయాడు.

బేతాళుడు ఈకథ చెప్పి, "రాజా,యోగి అంచనాలో వికాసుడి కన్న విశాఖుడు ఆరితేరిన శాస్త్రజ్ఞానిలా కనబడినట్టున్నది. ఇది ఆయన బాగా ఆలోచించి చెప్పిన అభిప్రాయమే అయివుంటుందా? వచ్చిన

వారికి నచ్చినా నచ్చకపోయినా, వికాసుడు వాళ్ళకు శాస్త్రోక్తంగా సలహాలిస్తున్నాడు. విశాఖుడు అలాకాక, దేవదత్తుడనే మంద మతిని అడ్డుపెట్టుకుని సందర్భశుద్ధిలేని సలహాలతో, పొగడ్తలతో వాళ్ళను తృప్తిపరిచి పంపుతున్నాడు. ఇది ఏ రకం శాస్త్రజ్ఞానమని పించుకుంటుంది? అంతేకాక, యోగిఅన్న వ్యవహారశాస్త్రం అనే శాస్త్ర గ్రంథం ఒకటు న్నదా? లేక వికాసుణ్ణి వేళాకోళం చేస్తూ ఆయన అన్నమాటా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వికాసుడు, విశాఖుడి దగ్గరకు సలహాలకోసం వస్తున్న వాళ్ళు సామాన్య గృహస్థులు. వాళ్ళకుశాస్త్రం ఏమంటున్నదో వివరించడంవృథా, అసం దర్భం. అంతేకాక, వాళ్ళ సమస్యలకు మేలు కలిగేవిధంగా పరిష్కారాలు సూచిం చడం అవసరంగాని, శాస్త్రంపేరుతో వాళ్ళకు నచ్చని లేక నష్టంకలిగించే సలహాలివ్వడం ఏవ్యవహారజ్ఞుడూ చేయకూడనిపని. వికా సుడైతే శాస్త్రాలు వల్లెవేశాడేగానీ, అతడికి వివిధ వ్యక్తుల మనస్తత్వం గురించిగానీ, వాళ్ళ వాళ్ళ వృత్తుల్లో ఎదురయ్యే విభిన్న మైన సమస్యల గురించిగానీ అవగాహన లేదు. అతడిది శాస్త్రం పేరుతో పిడుక్కూ, బియ్యానికీ ఒకటే మంత్రం అనే పెడధో రణి. ఇక, విశాఖుడలాకాదు. అతడిది పరి పూర్ణమైనశాస్త్రజ్ఞానం. ఆకారణంగానేఅతడు, తమ సమస్యల పరిష్కారానికి సలహా కావాలంటూ వచ్చేవాళ్ళను గజిబిజి పెట్ట కుండా ఎంతో లౌక్యంగా, మందమతి అయిన దేవదత్తుణ్ణి పొగడుతున్నట్టున టిస్తూ, వాళ్ళసమస్యలకుతృప్తికరమైన పరి ష్కారాలు చెప్పిపంపుతున్నాడు. పోతే,యోగి అన్న వ్యవహారశాస్త్రం సంగతి! అలాంటిది గ్రంథస్థమై వుండకపోవచ్చు. యోగి సూచన ప్రాయంగా వికాసుడికి చెప్పిందేమంటే- అన్ని శాస్త్రాలసారం, నిగ్గే వ్యవహారశాస్త్రం అనీ,అదినీలోలోపించిందనీ. ఈకారణాల వల్ల, విశాఖుడు నిజమైనశాస్త్రజ్ఞాని అని మనం నమ్మవచ్చు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: జొన్నలగడ్డ రామలక్ష్మి రచన]



సముద్రతీర ప్రయాణాలు - 23

# పూరీ — చాందిపూర్

రచన: మీరా నాయర్ ▼ చిత్రకారుడు : కె.ఎస్. గోపకుమార్




పూరీ జగన్నాథ మందిరానికి ముప్పై రెండు కి.మీ. దూరంలో సుప్రసిద్ధ కోణార్క సూర్యదేవాలయం ఉన్నది. ఒకవైపు చూపుకు అందినంత దూరం బంగాళాఖాత వినీల జలాలు; మరొకవైపు మామిడి తోటలు, సరుగుడు చెట్లు, యూకలిప్టస్ చెట్లు, తాడిచెట్లు, వరిపొలాలు విస్తరించుకున్న అందమైన తీరమార్గం గుండా ప్రయాణం చేసి – అద్భుతమైన శిల్ప కళాఖండంగా ప్రసిద్ధిగాంచిన కోణార్క సూర్యదేవాలయం చేరుకుంటాం.

ఇక్కడి ప్రజల ప్రధాన వృత్తులు వ్యవసాయం, చేపలు పట్టడం. వరినాట్లు వేయడం, నూర్పిళ్ళు చేయడం ఉత్సవం లాగా జరుపుకుంటారు. శ్రావణ పూర్ణిమ సమయంలో వరినాట్లు వేస్తారు; విత్తనాలు చల్లుతారు. ఆ సమయంలో పైరు ఏపుగా పెరగాలన్న ఆశతో పసిపిల్లలను పొలాలలో నడిపిస్తారు.

తీరంలో ఉన్న సూర్యదేవాలయం సముద్రంలో చాలా దూరంలో ఉన్నప్పుడే కనిపిస్తుంది. దేశంలోనే అతిపెద్ద దేవాలయం ఇది. ఒకప్పుడు ఈ దేవాలయం 60 మీ॥ ఎత్తుతో ఉండేది. ఆ కాలంలో అది సముద్రంలోని నావికులకు తీరం నుంచి మార్గం చూపే ముఖ్యమైన గుర్తుగానూ ఉండేది. యూరప నావికులు దీనిని 'బ్లాక్ పగోడా' (నల్లగుడి) అని పిలిచేవారు. పూరీలోని జగన్నాథ మందిరం వెల్ల వేయబడి ఉండడం వల్ల దానినుంచి వేరుచేయడానికి వాళ్ళు దీనికీపేరు పెట్టారు.

శ్రావణ పూర్ణిమ వరినాట్లు

శ్రీకృష్ణ, జాంబవతుల కుమారుడు సాంబుడు. ఆయనకు ఒకప్పుడు తీరని చర్మవ్యాధి సంక్రమించింది. సర్వవ్యాధినివారకుడైన సూర్యుణ్ణి ఆరాధించమని శ్రీకృష్ణుడు సాంబుణ్ణి ఆదేశించాడు.

పన్నెండేళ్ళ కఠోర తపస్సు తరవాత సాంబుడి వ్యాధి నయమయింది. కృతజ్ఞతా పూర్వకంగా సాంబుడు సూర్యుడికి గుడి కట్టించాడు. చంద్రభాగ నదిలో స్నానం చేస్తూండగా ఆయనకు సూర్యవిగ్రహం కనిపించింది. దానిని తెచ్చి ఆలయ గర్భగృహంలో ప్రతిష్ఠించాడు. ఇదీ సూర్యదేవాలయానికి సంబంధించిన స్థలపురాణ కథ!

పురాణకాలం నాటి ఆలయస్థానంలోనే, ఇప్పటి ఆలయాన్ని పదమూడవ శతాబ్దంలో గాంగ వంశానికి చెందిన లాంగుడ నరసింహదేవుడనే రాజు నిర్మించాడని చెబుతారు. ఈ ఆలయ నిర్మాణానికి 1200 మంది శిల్పకారులు పన్నెండేళ్ళు అహోరాత్రాలు శ్రమించారని చెబుతారు.

బ్రహ్మాండమైన ఈ దేవాలయాన్ని అద్భుత కళాఖండంగా తీర్చిదిద్దాలని బిసు మహారాణా అనే మహాశిల్పి సంకల్పించాడు. అతడు ఆలయ నిర్మాణంలో నిమగ్నుడైపోయి, దూర గ్రామంలో ఉన్న తన భార్యాపిల్లలను కూడా మరిచిపోయాడు. అతని కుమారుడు ధర్మపాదుడు పెరిగి యువకుడై తండ్రిలాగే గొప్ప శిల్పిగా పేరుతెచ్చుకున్నాడు. గ్రామాన్ని వదిలి తండ్రిని వెతుక్కుంటూ బయలుదేరాడు.

బిసురాణా ఆలయనిర్మాణాన్ని దాదాపు పూర్తి చేశాడు. కాని లెక్కలలో జరిగిన చిన్న పొరబాటు కారణంగా అతడు ఆలయ గోపురాగ్రంలో అమర్చవలసిన కలశభాగాన్ని సక్రమంగా అమర్చలేకపోయాడు. ఆలయ నిర్మాణంలో జాప్యం జరుగుతున్నదని రాజుగారి ఆగ్రహానికి గురయ్యాడు. అతడు వేదనకు లోనయ్యాడు. సరిగ్గా ఆ సమయంలో అతని కుమారుడు ధర్మపాదుడు అక్కడికి వచ్చి, లెక్కల లోపాన్ని

కోణార్క సూర్యదేవాలయం



సరిదిద్ది సకాలంలో ఆలయనిర్మాణాన్ని పూర్తిచేశాడు!

ఇప్పుడు ఆలయ గోపుర శిఖరం లేదు. అది లేకుండా గోపురం ఎత్తు 40 మీటర్లు. ఉరుకుతూన్న ఏడు గుర్రాలు పూన్చిన పురాణ సూర్యభగవానుడి రథాకృతిలో ఈ ఆలయ నిర్మాణం జరిగింది. ఏడు గుర్రాలు వారంలోని ఏడురోజులను సూచిస్తాయి. పన్నెండు జతల రథచక్రాలను పన్నెండు మాసాలకు లేదా సంవత్సరంలోని ఇరవై నాలుగు పక్షాలకు ప్రతీకలుగా చెబుతారు. ప్రతి చక్రానికీ పదహారు ఆకులు (చువ్వలు) ఉన్నాయి. ఒక రోజును పదహారు ప్రహరులు (జాములు)గా విభజించడం ప్రాచీన పద్ధతి. పదహారు చువ్వలను పదహారు ప్రహరులకు ప్రతీకలుగా చెబుతారు. సమయం తెలుసుకోవడానికి చక్రం నీడ ఒకప్పుడు సూర్యగడియారంలాగా ఉపయోగపడేదని చెబుతారు.

శతాబ్దాల తరబడి ఈ ఆలయాన్ని పట్టించుకునేవాళ్ళు లేకపోయారు. ఆలయం ఇసుకలో కూరుకు పోయింది. శిథిలావస్థకు లోనయింది. ఈ శతాబ్దారంభంలో దీని ఎత్తు పలువురి దృష్టిని ఆకర్షించింది. ఇసుకను, శిథిలశకలాలను తొలగించగానే అద్భుతమైన ఆలయ సౌందర్యం బయటపడింది. ఈనాడు దీనిని ఒక ప్రపంచ వారసత్వ పర్యాటకస్థలంగా 'యునెస్కో' ప్రకటించింది!

ఇక్కడి నుంచి మరికొంత దూరం ఉత్తరంగా పయనించామంటే మన దేశంలోని ముఖ్యమైన రేవులలో ఒకటైన పారాదీప్ చేరుకుంటాం. మన దేశం స్వాతంత్ర్యం సాధించిన తరవాత తూర్పుతీరంలో నిర్మించబడిన మొట్టమొదటి రేవు పారాదీప్. మనోహరమైన సముద్ర తీరంతో ఇదొక విహారస్థలంగానూ ఉంటున్నది. దక్షిణ అమెరికా వంటి దూరతీరాల నుంచి వేలకొద్ది సముద్రపు తాబేళ్ళు యేటా గుడ్లు పెట్టడానికి ఇక్కడికి వస్తాయి.



దీనికి మరికొంత ఎగువగా వున్న గహీర్‌మట్టతీరానికి ప్రపంచంలో కెల్లా చాలా ఎక్కువ సంఖ్యలో సముద్రపు తాబేళ్ళు వస్తాయి. యేటా జనవరి – ఫిబ్రవరి నెలలమధ్య గుడ్లు పెట్టి పొదగడానికి పదిలక్షల తాబేళ్ళు ఈ తీరానికి వస్తాయి. అంతరించి పోతున్నాయని భావించబడే ఆలివ్ రిడ్లే జాతికి చెందిన తాబేళ్ళు దాదాపు మూడు లక్షలు ఇక్కడికి వస్తాయి. ఇవన్నీ దాదాపు 10 కి.మీ. దూరం విస్తరించి ఉంటాయి.



బాఘా జాటిన్

ఇక్కడి నుంచి మరికొంతదూరం ఉత్తరంగా వెళ్ళామంటే బలేశ్వర్ అనే బాలాసోర్ చేరుకుంటాం. 1642వ సం॥లో బ్రిటిష్ వాళ్ళు ఇక్కడొక వర్తకపు రేవు నిర్మించారు. బాఘా జాటిన్‌గా పేరుగాంచిన ప్రముఖ విప్లవనాయకుడు జతీంద్రనాథ ముఖర్జీ ఇక్కడే బ్రిటిష్ వాళ్ళ తుపాకీ గుండ్లకు బలి అయ్యాడు. జర్మనీ నుంచి వచ్చిన మేవరిక్ నౌక నుంచి ఆయుధ సామగ్రిని తీసుకోవడానికి ఆయన 1915వ సం॥లో బాలాసోర్‌కు వచ్చాడు. అప్పుడే ఆయన్ను పోలీసులు కాల్చి చంపారు!

బాలాసోర్ జిల్లాలోని చాందిపూర్ తీరపట్టణం అందమైన సముద్రతీరానికి ప్రసిద్ధి గాంచింది. అలలు తక్కువగా ఉన్న దాదాపు ఐదు కి.మీ. తీరం సముద్రంలోకి చొచ్చుకుపోయి ఉన్నది. వెన్నెల రాత్రులలో ఈ తీరం వెండిలా మిలమిలా మెరుస్తుంది. ఆ కారణంచేతనే చాందిపూర్‌కు 'వెండి వెన్నెల పట్టణం' అనే పేరు వచ్చింది.

గుడ్లుపెట్టే కాలం



# మహాశిల్పి

ఒక గ్రామంలో కొన్నివేల ఏళ్ళ క్రితం ఒక మహాశిల్పి ఉండేవాడు. అతని చేతి మీదుగా ఎన్నో చిత్ర విచిత్ర భవనాలూ, సభలూ, ఆలయాలూ నిర్మించాడు. కొంత కాలానికి అతని ఖ్యాతి దేశదేశాలా వ్యాపించింది.

ఆ కాలంలో నాగలోకంలో నాగరాజు భవనం ఉపద్రవమైన భూకంపాల ఫలితంగా బీటలు విచ్చింది. దాన్ని తిరిగి నిర్మించటానికి భూలోకం నుంచి మహాశిల్పిని రప్పించాలని నాగరాజు నిశ్చయించాడు. అతడి కబురు చేరగానే శిల్పి పరమానందం చెంది, తాను మరొక్క గొప్ప భవనం నిర్మించవచ్చును గదా అనుకుని నాగలోకానికి వెళ్ళాడు.

త్వరలోనే శిల్పికీ, నాగరాజుకూ మంచి స్నేహం కలిసింది. నాగరాజు కుటుంబమూ, పరివారమూ అతనికి ఆప్తులయ్యారు. అతనికి అన్న పానాలకు ఎలాటి లోటూ జరగలేదు. అయినా శిల్పికి తన ఇంటి మీద గాలి మళ్ళింది. అంతులేని వైభవం మధ్యా, సంపద మధ్యా ఉంటూ కూడా అతను తన పేద ఇంటిని గురించీ, తన తల్లిని గురించీ, భార్యను గురించీ బెంగపడసాగాడు.

ఒకనాడు శిల్పి నాగరాజుతో, "రాజా, నాకీ మధ్య మా ఇంటి మీద ధ్యాస జాస్తిగా ఉంటున్నది. మా ఊరి పరిస్థితులు కాస్త కనుక్కుని నాకు చెబుతావా?" అని అడిగాడు.

"నిజం దాచటం దేనికి? మీ ఊరి ప్రాంతాల కొంతకాలంగా వానలు లేవు. అక్కడ భయంకర క్షామం ఉన్నది," అన్నాడు నాగరాజు.

"అలా అయితే అక్కడ వానలు కురిపించలేవా?" అన్నాడు శిల్పి.

**25–** ఏళ్ళనాటి చందమామ కథ




"అది ఎంత మాత్రమూ కుదరదు. అలా వానలు కురిపించటం నియమవిరుద్ధం. ఎక్కడ ఎప్పుడు క్షామం రావలిసిందీ ముందుగానే నిర్ణయమవుతుంది. ఈ కాటకం ఇంకా తొంభైతొమ్మిది రోజులుంటుంది," అన్నాడు నాగరాజు.

శిల్పికి కంపరం పుట్టుకొచ్చింది. అతని మనసులో తన గ్రామమూ, తన తల్లీ, భార్యా, తన బంధువులూ, మిత్రులూ, తిండికి అల్లాడుతూ కనిపించారు. వాళ్ళు తిండి లేక, నీరు లేక, ఆకులూ అలములూ పీక్కు తింటూ, క్రమంగా చచ్చిపోతూ ఉండటం అతను ఊహించుకున్నాడు.

"నాగరాజా, నిన్ను వేడుకుంటున్నాను. నాగ్రామానికి వాన పంపించు. నా వాళ్ళందరూ నీటికోసం తల్లడిల్లి పోతున్నారు. వాళ్ళు దిక్కులేని చావు చస్తారు!" అన్నాడు శిల్పి ఉద్రేకంతో.

"అమాయకుడా! వాళ్ళ గొడవ నీకు దేనికి? నా భవనం పని పూర్తికాగానే నీకు గొప్ప బహుమతి ఇస్తాను. నీకు అంతులేని మణులూ, బంగారమూ, వెండీ ఇస్తాను. నువ్వు బతికి ఉన్నన్నాళ్ళూ మహారాజులా బతుకు," అన్నాడు నాగరాజు.

"నాకు వానే కావాలి! మా గ్రామంలో అందరికీ వాన కావాలి. నీ వాళ్ళే మలమలా మాడిపోతూ ఉంటే నువ్విలా నిశ్చింతగా ఉండగలుగుతావా?" అన్నాడు శిల్పి ఎంతో బాధగా.

"నన్ను అనవసరంగా విసిగించకు! ఇప్పట్లో వానలేదు. అది అంతే!" అంటూ నాగరాజు లేచిపోయాడు.

శిల్పి వెళ్ళి పోవటానికి తన పనిముట్లూ అవీ సర్దుకోసాగాడు.

ఈ సంగతి విని నాగరాజు శిల్పి వద్దకు వచ్చి, "నిష్కారణంగా ఏమిటి నీ అలక?" అన్నాడు.

"లేదు, నాగరాజా! నేను మా వూరు వెళ్ళి అక్కడి పరిస్థితి ఏమిటో తెలుసుకోవాలి," అన్నాడు శిల్పి.

"ఎవరా అక్కడ? ఈ దుర్మార్గుణ్ణి బంధించండి," అని నాగరాజు తన సేవకులను కేక పెట్టాడు. క్షణంలో నాగ సేవకులు వచ్చి శిల్పిని చుట్టుముట్టారు.

"ఇప్పుడు చెప్పు. నా భవనం మరమ్మత్తు పూర్తి చేస్తావా, లేదా?" అని నాగరాజు అడిగాడు.

"మా గ్రామంలో వర్షం కురిపిస్తావా, లేదా?" అని శిల్పి ఎదురుప్రశ్న వేశాడు.

"కురిపించనని నీకు ముందేచెప్పాను," అన్నాడు నాగరాజు.

"అలా అయినప్పుడు నేను నీ పని పూర్తి చెయ్యను," అన్నాడు శిల్పి.

"వీణ్ణి తీసుకుపోయి, తల- "అంటూ నాగరాజు ఆగాడు. శిల్పి తల నరికేస్తే భవనం మరమ్మతులు ఆగిపోతాయన్నది జ్ఞాపకం వచ్చి వెంటనే ఆయన, "శిల్పిని వదిలెయ్యండి!" అన్నాడు నిట్టూర్చి.

ఇందువల్ల శిల్పి పరిస్థితి మెరుగైన దేమీ లేదు. అతన్ని నాగలోకం నుంచి వెళ్ళి పోనివ్వరు. తన గ్రామమేమో కాటకంలోనే ఉన్నది. శిల్పి ఒక చోట కూర్చుని, ఏం చెయ్యాలా అని ఆలోచిస్తూ ఉండగా అతని దృష్టి ఒక స్తంభం పైన పడింది.

శిల్పి వెంటనే లేచి ఆ స్తంభాన్ని రంపంతో కోయసాగాడు. స్తంభం తెగిపో తున్న కొద్దీ భవనం మొత్తంగా కంపించ సాగింది. నాగరాజు లబలబలాడుతూ వచ్చి, "ఆపు! నీకు పుణ్యం ఉంటుంది, ఆపు!"అని అరిచాడు.

"వాన కురిపిస్తావా మరి?" అని శిల్పి అడిగాడు.

"కురిపిస్తాను, కురిపిస్తాను," అన్నాడు నాగరాజు.

"హాస్యాలకుపోయి వరదలుతెప్పించేవు. మా గ్రామానికి కావలిసినంత వానే కురిపిం చాలి, గుర్తుంచుకో!" అన్నాడు శిల్పి.

"నువ్వు కోరినట్టే చేస్తాను," అన్నాడు నాగరాజు. భవనాలు కట్టగలవాడికి భవ నాలు కూల్చటం ఒక బ్రహ్మ విద్య కాదు. "నువ్వు వాన కురిపించాలే కాని నీ భవ నాన్ని చూసి ఇంద్రుడు అసూయపడేటట్టు



చెయ్యగలను," అన్నాడు శిల్పి. నాగరాజు శిల్పికి తన పైబట్ట కప్పి, "నువ్వు మీ గ్రామానికి వెళ్ళి అక్కడ వర్షం పడటం కళ్లారా చూసిరా!" అన్నాడు.

శిల్పి భూలోకానికి వచ్చాడు. అతను తన గ్రామంలో వర్షం పడటమూ, గ్రామస్థు లంతా ఆనంద పారవశ్యంతో కేకలు పెడుతూ ఉండటమూ కళ్ళారా చూశాడు. కాని గ్రామస్థులు అతన్ని చూడలేదు. వాళ్ళకు కనిపించినది ఒక మహాసర్పం.

"అమ్మో! ఎంత పెద్ద సర్పమో!" అన్నారు గ్రామస్థులు.

"ఇదే మనకు వర్షం తెచ్చింది. దీనికి గుడి కట్టుదాం!" అన్నారు. త్వరలోనే గుడి పూర్తి అయింది. గ్రామానికి కరువు కూడా పోయింది.

శిల్పి నాగలోకానికి తిరిగి వెళ్ళి నాగ రాజుతో, "నన్ను మోసం చేసి నాగరూపంలో పంపావు. నా వారి నందరినీ చూశాను. కాని వారితో మాట్లాడలేక పోయాను," అన్నాడు.

"నువ్వు మహా పెంకె మనిషివి! అందు చేత నా జాగర్త నేను పడ్డాను. నా మాట నేను నిలబెట్టుకున్నాను. నీ పని నువ్వు పూర్తిచెయ్యి," అన్నాడు నాగరాజు.

శిల్పి నాగరాజు భవనాన్ని అద్భుతంగా తయారు చేశాడు. ఇంద్రుడు గృహ ప్రవే శానికి వచ్చి, ఆ భవనాన్ని చూసి నిజం గానే అసూయపడ్డాడు. శిల్పికి నాగరాజు అంతులేని బహుమానాలిచ్చి ఇంటికి పంపేశాడు.

అతన్ని ఎరిగినవాళ్ళు, "ఇంతకాలం ఏమయ్యావు? నువ్వు లేనప్పుడు ఇక్కడ ఎటువంటి కరువు వచ్చిందనుకున్నావు? ఏదో దేవతా సర్పం వచ్చి వాన కురిపిం చింది. దానికి గుడి కూడా కట్టాం. కాని అది కొంత కాలానికి ఎటో వెళ్ళిపోయింది," అని చెప్పారు.

"నేనే ఆ సర్పాన్ని," అన్నాడు శిల్పి.

చాలామంది అతని మాట నమ్మలేదు. అతను ఊళ్ళో అందరికీ తన అనుభవాలు చెప్పాడు. అప్పుడు జనం నమ్మటమే గాక, అతను గ్రామానికి చేసిన మేలు తెలుసుకుని ఎంతో గర్వపడ్డారు.

అటు తరవాత ఆ గ్రామానికి సర్పపురం అనే పేరు వచ్చింది.



THEY STOOD UP TO THE BRITISH!

1

# మీర్ ఖాసిం

STORY : MEERA UGRA
PICTURES : GOUTAM SEN

1757 జూన్ 23న సాధించిన ప్లాసీ యుద్ధ విజయానంతరం బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీకి బెంగాల్‌లో పాలకులను నిర్ణయించే అధికారం సిద్ధించింది. తమ రాజు సిరాజ్-ఉ-ద్దౌలాకు ద్రోహం తలపెట్టిన సేనానాయకుడు మీర్ జాఫర్‌ను కంపెనీ, బెంగాలుకు సుబేదారుగా నియమించింది. ఆ తరవాత 1760వ సం॥లో మీర్ జాఫర్‌ను తొలగించి అతని అల్లుడైన మీర్‌ఖాసింను అతని స్థానంలో నియమించింది.








ఆక్రాయ్ (సుంకం) చెల్లించడానికి కంపెనీ అధికారులు నిరాకరించారు.




ఆవిధంగా కంపెనీ, స్థానికుల కన్నా అతి తక్కువ ధరలకు సరుకులను అమ్మ గలిగింది.







వర్తకులు కొందరు మీర్‌ఖాసిం దగ్గరికి వెళ్ళి విషయం చెప్పగానే-




మీర్ ఖాసిం ఈ విషయంగా ఈస్ట్ఇండియా కంపెనీ గవర్నర్‌కు ఉత్తరం రాశాడు. కాని దానికి సమాధానం రాలేదు -



మీర్ ఖాసిం వ్యాపార సుంకాలనూ
స్థానిక పన్నులనూ రద్దు చేశాడు.




ఆంగ్లేయులు ఆగ్రహం చెందారు.







తన ఆజ్ఞను ఉపసంహరించుకోవడానికి మీర్ఖాసిం అంగీకరించలేదు.




పాట్నాలోని ఆంగ్లేయుల ఫ్యాక్టరీ అధికారి ఎల్లిస్ నాయకత్వంలో బ్రిటిష్ సేనలు 1763 జూన్ 21వ తేదీ పాట్నా నవాబుకోటను ముట్టడించాయి.



మీర్ ఖాసిం సేనలతో పాట్నాకు వెళ్ళి. ఎల్లిస్ రక్షణ సేనను పట్టుకున్నాడు.




అయితే ఆ తరవాత జరిగిన యుద్ధాలలో మీర్ ఖాసిం సేనలు ఓడిపోయాయి.




1764 అక్టోబర్ 22వ తేదీ జరిగిన బక్సర్ యుద్ధంలో. మీర్ ఖాసిం అతని మిత్రుల సేనలు ఓడిపోయాయి.



మీర్ ఖాసిం ప్రాణాలతో తప్పించుకుని ఢిల్లీకి పారిపోయి. ఆంగ్లేయులకుపట్టుబడకుండా శేషజీవితంగడిపాడు.

రెండవ షా ఆలం 1765 ఆగస్టు 12వ తేదీ బెంగాల్. బీహార్. ఒరిస్సా ప్రాంతాలను లాంఛనప్రాయంగా ఈస్టిండియా కంపెనీకి దివానీగా ఇచ్చాడు.



బెంగాల్ మళ్ళీ దోపిడీకి గురి చేయబడింది. 1769 మే 20వ తేదీ రిచెర్డ్ బెచెర్ అనే కంపెనీ ఉన్నతోద్యోగి రహస్య కమిటీ డైరెక్టర్‌లకు ఇలా రాశాడు: కంపెనీ దివానీ తీసుకున్న తరవాత ఈ దేశ ప్రజల పరిస్థితి మరింత అధ్వాన్నంగా తయారయింది. సంపన్నమైన ఈ దేశం నాశనం కేసి దిగజారుతున్నది.




మర్నాడు తెల్లవారగానే కీచకుడు రాజభవనానికి వచ్చి ద్రౌపదిని చూసి, "నా పరాక్రమం చూశావు గదా! నిన్న రాజసభలో నిన్ను తన్నితే ఒక్కడు కూడా నోరెత్తలేకపోయాడు. ఈ విరాటుడు పేరుకే రాజు సేనలన్నీ నా ఆధీనంలో ఉన్నాయి. నేనే అసలైన రాజును. నా చేత సేవలు చేయించుకుని నన్ను ధన్యుణ్ణి చెయ్యి. నీకు రోజుకు నూరు మాడలు ఇస్తాను. వందల కొద్దీ దాస దాసీలను ఇస్తాను. మంచి రథం ఇస్తాను," అని మళ్ళీ బతిమిలాడ నారంభించాడు.

"నీకు నిజంగా నేను కావాలంటే,నేను చెప్పిన నియమాలకు లోబడాలి. మన రహస్యం రాజసభకుగాని, నీ తమ్ములకు గాని ఏమాత్రమూ తెలియరాదు. ఈ రహస్యం బయటికి పొక్కిందో గంధర్వులు తప్పక తెలుసుకుంటారు. అదే నాభయం. ఇందుకు నువ్వు ఒప్పుకుంటే నేను నీ దానను అవుతాను," అని ద్రౌపది అన్నది.

కీచకుడు,"అలాఅయితేఎవ్వరికీ తెలియకుండా నువ్వు ఉండే చోటికి వస్తాను. గంధర్వులకు తెలియ నివ్వను," అన్నాడు.

అప్పుడు ద్రౌపది, "నర్తనశాలలో రాత్రి వేళఎవరూ ఉండరు. బాగా చీకటి పడినాక అక్కడికి రా. మనం అక్కడ కలుసుకుంటే ఎవరికీ తెలీదు. గంధర్వులు కనుక్కోలేరు," అన్నది.

తరవాత ఆమె, తాను కీచకుడితోచేసిన ఏర్పాటు గురించి భీముడికి తెలిపింది.

సైరంధ్రి ఆహ్వానం మృత్యువు పిలుపే నని గ్రహించలేని మూర్ఖుడు కీచకుడు, సంతోషంతో ఆ పగలు ఎలా గడిచినది కూడా తెలుసుకోలేక పోయాడు.

ఈ లోపల భీముడికి కీచకుణ్ణి చంపాలన్న ఉత్సాహం మితిమీరిపోయింది.

**40. కీచకవధ**



త్వరలోనే కీచకుడు రకరకాల అలంకారాలు చేసుకుని సైరంధ్రి కోసం తహతహ లాడుతూ నర్తనశాల ప్రవేశించాడు. భీముడుమంచంమీద పడుకుని ఉన్నాడు. కీచకుడు అతన్ని చేత్తో తడుపుతూ, "నా అంతఃపురంలో ఎన్నో అలంకారాలు చేయించి, వందలకొద్దీ దాసీలనూ, బోలెడంత ధనాన్నీ నీకోసం సిద్ధంగా ఉంచాను. నా అంతఃపుర స్త్రీలు నావంటి అందగాడు ప్రపంచంలో లేడని మెచ్చుకుంటారు. అలాటి వాణ్ణి నీ కోసం ఈ చీకటిలోపడి ఒంటరిగావచ్చాను," అన్నాడు.

దానికి భీముడు, "నిజంగా నువ్వు అందగాడివే. కాని ఇలాటి స్పర్శ నువ్వు ఎప్పుడూ అనుభవించి ఉండవు," అంటూ మంచం మీది నుంచి లేచి, "ఏనుగును సింహం చంపినట్టు నిన్ను చంపుతాను. సైరంధ్రికి నీ పీడ విరగడ అయిపోతుంది," అంటూ కీచకుడి జుట్టు పట్టుకుని లాగాడు.

కీచకుడు తన జుట్టు విడిపించుకుని భీముడితో కలియబడ్డాడు. జయించాలన్న దీక్షతో ఇద్దరూ భయంకరంగా పోరాడుతూ, చేతులతోనూ, గోళ్ళతోనూ, పళ్ళతోనూ ఒకరి నొకరు హింసించారు. కీచకుడు ఎంత బలమైన దెబ్బలు కొట్టినా భీముడు నిలబడిన చోటి నుంచి కదలకుండా స్తంభంలాగా ఉండిపోయాడు. వారి పోరాటంతో నర్తనశాల కంపించిపోయింది.

ఈ పోరాటం మధ్యలో భీముడు కీచకుణ్ణి బలంగా కాలితో తన్ని పడదోశాడు. ఆ పాటుకు కీచకుడు కదలక పోవటం చూసి అతని రొమ్ములో బలంగా పొడి

అతను ద్రౌపదితో, "వాణ్ణి రహస్యంగాకాక పోతే బహిరంగంగానే చంపుతాను. వాణ్ణి చంపి అలాగే వెళ్ళి దుర్యోధనుణ్ణి చంపేస్తాను. కావలిస్తే ధర్మరాజును ఈ విరాట రాజుకొలువుచెయ్యనీ!" అన్నాడుఉద్రేకంతో.

ద్రౌపది అతన్ని నిగ్రహించుతూ, "నువ్వు వాణ్ణి నియమాలు ఉల్లంఘించకుండా చంపు," అన్నది.

"సరే, ఇవాళ రాత్రి చీకటిలో నేనెవరో కూడా వాడికి తెలియరాకుండా నువ్వు చెప్పినట్టే చంపి పారేస్తాను," అన్నాడు భీముడు.

ఆ రాత్రి గాఢాంధకారంలో భీముడు నర్తనశాల చేరుకుని, లేడి రాక కోసంవేచి ఉండే సింహంలాగా కీచకుడికోసం పొంచి ఉన్నాడు.

చాడు. తరవాత కీచకుణ్ణి చేతులతో పట్టుకుని గిరగిరా తిప్పాడు. కీచకుడి గొంతు పట్టుకుని పిసికాడు. తరవాత కీచకుడి మీద ఎక్కి మోకాళ్ళతో కుమ్ముతూ పశువును చంపినట్టు చంపాడు. కీచకుడు చచ్చిన తరవాత కూడా వదలక, అతని కాళ్ళూ, చేతులూ, తలా మొండెంలోకి తోసి, కీచకుడి శవాన్ని ఒక పెద్ద మాంసపు ముద్దలాగా తయారు చేశాడు.

భీముడు ఆ స్థితిలో ఉన్న శవాన్ని కాలితో ఒక్క తన్ను తన్ని, మంటచేసి,దాని వెలుగులో ఆశవాన్ని ద్రౌపదికిచూపి, "నిన్ను కామించిన వాడి కెవడికైనా ఇదే గతి!"అని చెప్పి, వంట ఇంటికి వెళ్ళిపోయాడు.

తరవాత ద్రౌపది నర్తనశాలను చూసే సేవకులను లేపి, "కీచకుణ్ణి గంధర్వులు నర్తనశాలలో చంపారు. వెళ్ళి చూడండి," అని చెప్పింది. వాళ్ళు కంగారు పడుతూ దివిటీలు వెలిగించి నర్తనశాల ప్రవేశించి, అమానుషంగాచంపబడిన కీచకుడి శవాన్ని చూసి, కాళ్ళూ, చేతులూ, మెడా ఎక్కడ ఉన్నదీ పోల్చలేకపోయారు.

అక్కడ ఉండే కీచకుడి బంధువులు శవం చుట్టూ ఏడవసాగారు. తాబేలులాగా అయిపోయిన కీచకుడి శవంచూసి వారికి కంపరం పుట్టింది. శవానికి సంస్కారం చెయ్యాలి గనక ఉపకీచకులు దాన్ని తీసుకుపోయే యత్నంలో ఉండగా, దగ్గిర లోనే ఒక స్తంభాన్ని కౌగలించుకుని ఉన్న సైరంధ్రి వారి కంటపడింది.

"దీని కోసమే మన అన్న చచ్చాడు. దీన్ని కూడా మన అన్న శవంతో బాటు



దహించితే అతడికి సంతోషం కలుగుతుంది," అనుకుని ఉపకీచకులు విరాటుడితో ఆమెను కీచకుడితో పాటు దహనం చేస్తామనీ, అందుకు అనుమతి ఇవ్వమనీ అన్నారు. విరాటుడు వారికి ఎదురుచెప్పే ధైర్యంలేక సరేనన్నాడు.

ఉపకీచకులు ద్రౌపదిని కీచకుడి శవంతో కలిపి కట్టి, శ్మశానానికి బయలుదేరారు. దారిలో ద్రౌపది గట్టిగా గొంతెత్తి తన భర్తలను వారి రహస్య నామాలతో పిలుస్తూ, "జయా, జయంతా, విజయా, జయత్సేనా, జయద్బలా, ఈ కీచకులు నన్ను పట్టుకుపోతున్నారు," అని కేకలు పెట్టింది.

అప్పుడే పడుకుని నిద్రకు ఉపక్రమించిన భీముడు ఈ కేకలకులేచి, "సైరంధ్రీ,



భయపడకు. నేనువస్తున్నాను," అని కేక పెట్టి మారువేషం వేసుకుని, ప్రాకారందూకి, శ్మశానం కేసి పరిగెత్తాడు.

అతను వెళ్ళేటప్పటికి చితి సిద్ధంగా ఉన్నది. భీముడు అక్కడ ఉన్న ఒక చెట్టును కౌగలించుకుని పెకలించి, దాన్ని ఆయుధంగా పట్టుకుని ఉపకీచకులకు ఎదురు వచ్చాడు.

అతన్ని చూడగానే, "అమ్మో, గంధ ర్వుడు!" అని అరిచి, ద్రౌపదిని అక్కడే వదిలేసి, ఉపకీచకులు నగరంకేసి పరుగు తీశారు. భీముడు ఆ నూట అయిదు గురునీ వెంట తరిమి చంపి, ద్రౌపది కట్లు విప్పి, "నువ్వు నిశ్చింతగా అంతఃపు రానికి తిరిగి వెళ్ళు. నేను వంటసాలకు పోతాను," అన్నాడు.

చచ్చి చెట్లలాగా పడి ఉన్న ఉపకీచకు లనూ, అంతఃపురానికి తిరిగి వెళుతున్న సైరంధ్రినీ చూసిన మనుషులు విరాటరాజు దగ్గిరికి వెళ్ళి, "మహారాజా, కీచకులందరూ చచ్చారు. గంధర్వులు వాళ్ళను చంపీ సైరంధ్రిని విడిపించారు. ఆమె తిరిగివస్తు న్నది. ఆమెను మోహించిన వారికి అంద రికీ ఇదేగతిపట్టుతుంది. ఆవిధంగా మన నగరమే నాశనమవుతుంది. ఈ సైరంధ్రి కారణంగా మనకుహాని కలగకుండా ఏదైనా పద్ధతి ఆలోచించండి," అన్నారు.

విరాటరాజు వారితో కీచకులందరినీ ఒకే చితిలో దహనం చెయ్యమని చెప్పి, సుధేష్ణ వద్దకు వెళ్ళి, "ఆ సైరంధ్రి రాగానే ఆమెను మర్యాదగా పంపించివెయ్యి. ఆమె కారణంగా గంధర్వులవల్ల ఏమి పరాభవం జరుగుతుందోనని నేను భయపడుతు న్నట్టు ఆమెకు చెప్పు. తనతోచెప్పే ధైర్యం లేక నిన్ను చెప్పమన్నానని కూడా చెప్పు," అన్నాడు.

ద్రౌపది సచేల స్నానం చేసి నగరానికి తిరిగివస్తుంటే, గంధర్వుల భయం కొద్దీ కొందరు ఆమెను చూసి పారిపోయారు. మరికొందరు భయంతో కళ్ళు గట్టిగా మూసుకున్నారు.

ఆమె వంటసాల సమీపంలోకి వచ్చే సరికి భీముడు వాకిలి దగ్గిర ఏనుగులాగా నిలబడి ఉన్నాడు. అతన్ని చూసి ద్రౌపది చిన్నగా, "నన్ను కాపాడిన గంధర్వరాజుకు నమస్కారం," అన్నది. "నిన్ను సేవిస్తూ ఇక్కడ తిరిగేవాళ్ళు ఋణ విముక్తులై నారు," అన్నాడు భీముడు.

ద్రౌపది ముందుకు కదిలి నర్తనశాల వద్దకు చేరి, అక్కడ రాజకుమార్తెలకు నృత్యం నేర్పుతున్న అర్జునుణ్ణి చూసింది. ఆమెను చూడగానే నర్తనశాలలో ఉన్న అర్జునుడూ, రాజకుమార్తెలూ ఆమె వద్దకు వచ్చి, గొప్ప ప్రమాదం నుంచి బయట పడినందుకు ఆమెను అభినందించారు.

అర్జునుడు, "సైరంధ్రీ, నువ్వు ఎలా బయట పడ్డావు? ఆ దుర్మార్గులు ఎలా చచ్చారు?" అని ద్రౌపదిని అడిగాడు.

"బృహన్నలా, ఎందుకు అడుగుతావు? నువ్వు ఆర్చగలదీ, తీర్చగలదీ ఏమన్నా ఉన్నది గనకనా? సుఖంగా కన్యాంతః పురంలో కూర్చుని, ఈ సైరంధ్రి గతి ఏమయినదీ తెలియకుండానే, నవ్వుతూ అడగ వచ్చావు!" అని ద్రౌపది అర్జునుణ్ణి దెప్పి పొడిచింది. "నీతో ఇంతకాలం స్నేహంగా ఉన్న నాకు నిన్ను గురించి దుఃఖంఉండదా? ఒకరి మనస్సు మరొక రికేం తెలుస్తుంది?" అన్నాడు అర్జునుడు.

ద్రౌపది రాజకుమార్తెలతో సహా రాజు గారింటికి వెళ్ళేసరికి సుధేష్ణ తన భర్త చెప్పమన్నట్టుగానే, "నిన్నూ, నీ గంధర్వు లనూ గురించి రాజుగారు చాలా భయప డుతున్నారు. నువ్వు మరెక్కడికైనా వెళ్ళిపో. నీ అందం చూస్తే ఎలాటి వారికైనా మతి చెడుతుంది. గంధర్వులు చూడబోతే మహా కోపిష్ఠివాళ్ళుగా ఉన్నారు," అన్నది.

"అమ్మా, ఇంకా పదమూడు రోజులు రాజుగారు నన్నుక్షమించినట్టయితే గంధ ర్వులు నన్ను తీసుకుపోతారు. ఆ తరవాత రాజుగారూ, వారి బంధువులూ, మిత్రులూ సుఖంగాఉండవచ్చు,"అనిద్రౌపదివేడింది.

మహా బలవంతుడైన కీచకుడు తమ్ము లందరితో సహా చచ్చిపోవటంతో విరాట నగరంలోవాళ్ళు చాలా బాధపడ్డారు. ఎవరో



ఆడదాని మూలాన కీచకుణ్ణి గంధర్వులు హత్య చేశారన్న వార్త దేశ దేశాలా వ్యాపించింది. ఇదే సమయానికి దుర్యోధనుడి చారులు పాండవుల జాడ కోసం అనేక దేశాలూ, కొండలూ, తీర్థాలూ, గ్రామాలూ గాలించి హస్తినాపురానికి తిరిగి వచ్చి, ఎక్కడా పాండవుల ఆచూకీ దొరకనట్టు చెప్పారు. పాండవులు చచ్చిపోయి ఉండ వచ్చునని వాళ్ళు ఊహించారు. కీచకుణ్ణి గంధర్వులుచంపారన్న వార్త కూడా వాళ్ళే తెచ్చి, "ఆ గంధర్వులు ఎవరికీ కనిపించ లేదట," అన్నారు.

దుర్యోధనుడు తన సభలో ఉన్న వారితో, "ఏంచెయ్యాలోతెలియటం లేదు. ఈ విషయంగా మీరు కూడా ఆలోచించండి. పాండవుల అజ్ఞాతవాసం ఇంకా కొంచెమే మిగిలి ఉన్నది. గడువు దాటే లోగా వారి జాడ తెలుసుకున్నామంటే మాటకు కట్టుబడి ఉండే ఆ పాండవులు తిరిగి పన్నెండేళ్ళు వనవాసం ప్రారంభిస్తారు," అన్నాడు.

కర్ణ దుశ్శాసనులు మళ్ళీ చారులను పంపమన్నారు. వాళ్ళు తప్పక బతికే ఉంటారనీ, వారిని వెతకటానికి వాళ్ళ సంగతి తెలిసిన చారులను పంపమనీ ద్రోణుడు అన్నాడు. భీష్ముడు కూడా పాండవులు బతికే ఉన్నారని ఊహిస్తూ, "ధర్మ రాజు ఉండేదేశంసుభిక్షంగా ఉంటుంది. అక్కడి ప్రజలు సంతృప్తితోనూ, ధర్మప రులుగానూ జీవిస్తూ ఉంటారు. వర్షాలు సక్రమంగా కురుస్తాయి. అలాటి దేశంకోసం వెతికించు," అన్నాడు.

తరవాత కృపాచార్యుడు దుర్యోధనుడితో, "భీష్ముడు చెప్పినది నిజం. ఒక వంక పాండవులకోసం వెతుకుతూ, మనం చెయ్యవలసినపని ఒకటి ఉన్నది. పాండవులు అజ్ఞాతవాసం ముగించ గలిగితే రాజ్యంకోసం యుద్ధం చేసి తీరుతారు. అందుచేత మనం మన బలాలనూ, ధనాన్నీ, రాజనీతినీ పెంపొందించుకోవాలి. సామదానభేద దండోపాయాలు ప్రయోగించి బలవంతులనూ, బలహీనులనూ మన పక్షం చేసుకోవాలి, కోశం నింపుకోవాలి. అలా అయితే పాండవుల పక్షాన పోరాడే రాజులనందరినీ యుద్ధంలో జయించి సుఖపడతావు," అన్నాడు.



# చందమామ కబుర్లు



## రెవరెండ్ స్పైడర్‌మేన్

గోడల మీదికి ఎగబ్రాకడం, భవనాల పైకప్పుల మీద నడవడం కామిక్స్ పాత్ర 'స్పైడర్‌మేన్' కు సర్వ సాధారణమైన విషయం. సినిమాలలో, కామిక్స్ చిత్రాలలో దీనిని చాలామంది చూసే ఉంటారు. స్పైడర్‌మేన్ లాగా కాకపోయినా 12 నుంచి 15 అడుగుల ఎత్తయిన గోడలను - వాటి స్థితి ఎగుడుదిగుడుగా, నున్నగా లేదా తడిగా ఎలా ఉన్నప్పటికీ సునాయాసంగా ఎగబ్రాకగల సమర్థుడు కేరళ రాష్ట్రంలోని ముత్తోళిలో ఉన్నాడు. ఆయన పేరు రెవరెండ్ ఫాదర్ మాథ్యూ. ఆయన పూనేలో కరాటే శిక్షణ పొంది బ్రౌన్ బెల్ట్ సాధించాడు. రైతుకుటుంబంలో పుట్టిన మాథ్యూ పదవతరగతి ప్యాసయ్యాక ఆధ్యాత్మిక విషయాలలో, చర్చ్ కార్యకలాపాలలో ఆసక్తి పెంచుకుని అందులోనే శిక్షణ పొంది 'రెవరెండ్ ఫాదర్' అయ్యాడు. ఆయన ఉంటూన్న డాబా మీద ఒకసారి పిల్లి ఒకటి చిక్కుకుపోయింది. దానిని కిందికి తీసుకురావడానికి మిగిలిన వాళ్ళు నిచ్చెన కోసం వెళ్ళారు. ఫాదర్ మాథ్యూ దానిని చూసి గోడమీదుగా చకచకా డాబా మీదికి ఎగబ్రాకి, పిల్లిని జాగ్రత్తగా పట్టుకుని అక్కడినుంచి నేల మీదికి దూకేశాడు! రెవరెండ్ ఫాదర్ సామర్థ్యం చూసిన ఆయన సహాధ్యాయులు అమితాశ్చర్యం చెందారు!

## బంగారు గడియలు– 16 సమాధానాలు (ఆగస్ట్'97)

**ప్రపంచంలో ఎక్కడ?**

1. కర్నాటక రాష్ట్రం బేలూరు చెన్నకేశవ ఆలయంలో.
2. దక్షిణ అమెరికాలోని పెరూ. 3. పోలండ్‌లోని వీలిష్కా.

**జంతు ప్రహేళిక:**

1. పెంగ్విన్ 2. చింపాంజీ 3.నీలి తిమింగలం 4. కివీ 5. నిప్పుకోడి 6. ఒంటె 7. డింగో.

**కథా ప్రహేళిక:**

హడావుడిలో తన సైకిల్‌ను స్టాండులో వదిలి మరొకరి సైకిల్ తీసుకుని వచ్చేశాడు.

**సరదా ప్రశ్నలు:**

1. ఇదొక చెట్టుపేరు. 2. బంతిని పైకి విసరండి. అది తిరిగి కిందికి వస్తుంది. 3. ఆసియా ఖండంలోని కోతులు అలా తోకలతో వేలాడలేవు. 4. అతడు పెన్సిల్ తీసుకుని 'నా ఎడమ చెవితో' అని రాశాడు. 5. అది లేచే దాకా కాచుకుని ఉంటారు. 6. రెండేళ్ళ లేగదూడ అవుతుంది. 7. వయసు పెరగడం.





# మీర్జాపూర్ తివాసీలు



మీర్జాపూర్‌లో ఎటుతిరిగినా సైకిళ్ళ మీద, టోంగాల మీద, మోటారు సైకిళ్ళ మీద, జీపులలో, ఒక్కొక్కసారి ఒంటెల మీద తివాసీలే కనిపిస్తాయి. చేనేత తివాసీలకు మీర్జాపూర్ ప్రసిద్ధిగాంచింది. ఈ కళను మొదట ప్రాచీన ఈజిప్టు నుంచి ఇతరులు నేర్చుకున్నారని చెబుతారు.

ఇవాళ గంగానదికి దక్షిణంగా ఉన్న 'మీర్జాపూర్-భాగోలీ' ప్రాంతంలోనే ఎక్కువ చేనేత తివాసీలు తయారుచేస్తున్నారు. కాశ్మీరు తివాసీల్లాగా కాకుండా, మీర్జాపూర్ చేనేత కార్మికులు పర్షియన్ డిజైన్ల మీద 'నక్షా' తయారుచేసుకుని దానిమీద తివాసీ నేస్తారు.

తివాసీ రకాలను 7/52, లేదా 9/60 అని చెబుతారు. ఒక చదరపు అంగుళానికి ఎన్ని ముడులు ఉంటాయో తెలుసుకోవాలంటే– పై రెండు అంకెలను ఒకదానితో ఒకటి గుణించి, వచ్చే మొత్తాన్ని నాలుగుతో భాగించాలి. ఇండో పర్షియన్ డిజైన్ 9/60 రకానివి, చదరపు మీటరు 700 నుంచి 900 రూపాయల ధర పలుకుతాయి.

మనదేశానికి చెందిన తివాసీలు 1851వ సం॥లో జరిగిన లండన్ ఎగ్జిబిషన్‌లో మొట్టమొదట ప్రపంచ దృష్టిని ఆకర్షించాయి. ప్రస్తుతం మనదేశం నుంచి తివాసీలను ముఖ్యంగా జర్మనీ, ఇంగ్లాండు, అమెరికా, ఆస్ట్రేలియా దేశాలకు ఎగుమతి చేస్తున్నారు.

పురాణకాలంనాటి రాజులు :

# జహ్నుడు

ప్రజలకు ఏ కొరతాలేకుండా పరిపాలనసాగించే ధర్మప్రభువు జహ్నుడు. ఆయన పాలనలోప్రజలు సుఖసంతోషాలతో జీవించారు. రాజు ప్రజల స్థితి గతులను ప్రత్యక్షంగా తెలుసుకోవడానికి తరచూ దేశసంచారం చేసేవాడు. గ్రామ ప్రజలు పొలం పనులలో, ఆటపాటలలో నిమగ్నులై ఉండడం చూసి ఆయన ఎంతో సంతోషించేవాడు.

ఒకనాడు రాజు ఒక నదీతీరంలో కూర్చుని నదీ జలాన్ని తదేకంగా గమనించసాగాడు. నదీజలం నిరంతరాయంగా ప్రవహిస్తున్నది. కాలం కూడా నదిలాగే క్షణం ఆగకుండా సాగిపోయేదే కదా! అది చేజారకముందే జీవితంలో మంచి పనులు చేయడమే కదా వివేకం? అన్న ఆలోచనలు రాజు మనసులో కదిలాయి.

ప్రజల యోగ క్షేమాలను చూడడమే రాజు కర్తవ్యం. ప్రజలు హాయిగా ఉన్నారు. పొరుగురాజులు కూడా ధర్మపరులూ, శాంతిప్రియులూ గనుక ప్రజలకు శత్రుభయం కూడా లేదు. కాబట్టి శేషజీవితాన్ని యోగసాధనకు వినియోగిస్తేనే కాలాన్ని సద్వినియోగం చేసినట్టవుతుంది అని రాజు భావించాడు.

రాజు తన కుమారుడైన బాలకాశ్వుడికి రాజ్యాన్ని అప్పగించి, హిమాలయ పాదతలం చేరి, హరిద్వార పరిసర ప్రాంతంలో తపస్సుకు ఉపక్రమించాడు. తీవ్రమైనయోగసాధనతో అచిర కాలంలోనే అద్భుతమైన యోగశక్తిని సాధించాడు.

ఒకనాడాయన కొండశిఖరంపై నిలబడి ప్రశాంత ప్రకృతిని తిలకిస్తూండగా, ఉత్తర దిశగా ఉన్న కొండలపై నుంచి జల ప్రవాహం ఉరుకుతూరావడం గమనించాడు. క్షణాలలో ఆ జలప్రవాహం పాదతలంలోని జహ్నుడి కుటీరాన్ని ముంచెత్తింది. జహ్నుడు ఆగ్రహంతో ఆ ప్రవాహాన్నంతా తాగేశాడు!

పాతాళంలో బూడిద రాసులుగా పడివున్న తన తాతలకు శాపవిముక్తి కలిగించడానికి, భగీరథుడు కఠోర తపస్సు చేసి ఆకాశం నుంచి భూమిమీదికి దించిన గంగాప్రవాహం అది! భగీరథుడు ఆ సంగతిని జహ్నుడికి వివరించి, గంగను విడిపించమని ప్రార్థించాడు. కరుణా స్వభావుడైన జహ్నుడు గంగా ధారను చెవి ద్వారా జారవిడిచాడు. అందుకే గంగా నదికి జాహ్నవి అనే పేరు ఏర్పడిందని పురాణాలు పేర్కొంటాయి!



## మీకు తెలుసా?

## ఎత్తయినగోపురం





గ్రేటర్ మాస్కోలోని ఒస్టాన్కినోలో గోపురం ఎత్తు 523 మీటర్లు. ఇతర ఆధారం లేకుండా నిలబడే ఎత్తయినగోపురం ఇది. ఎన్.వి.నికిటిన్ అనే శిల్పకారుడు రూపొందించిన ఈ గోపురం కాంక్రీటుతో నిర్మించబడింది. దీని బరువు 55,000 టన్నులు. గోపురాన్ని చూడడానికి వచ్చేవాళ్ళను 500 మీ॥ ఎత్తువరకు లిఫ్టులలో వెళ్ళడానికి అనుమతిస్తారు. లిఫ్టులు సెకండుకు 7 మీ॥వేగంతో పైకి వెళతాయి. గోపురంలో 337 మీ॥ ఎత్తులో ఒక హోటల్ కూడా ఉంది. ఈ గోపురం మీద టెలిస్కోపు ఆకారంలో సిలిండర్ ఉంది. ఇందులో అతి శక్తివంతమైన 'ఏరియల్స్' అమర్చారు. ఇవి మెరుపులను ఆకర్షించి వాటి శక్తిని నమోదుచేస్తాయి.

ఈ గోపురం గాలికి ఇంచుమించు 5 మీ॥ దాకా వంగుతుంది. సూర్యుడి వేడికి ఈ గోపుర శిఖరం వ్యాకోచిస్తుంది. 20 డిగ్రీల సెల్షియస్ వేడిలో, గోపురం ఎత్తు దాదాపు 540 మీ॥ వరకు పెరగవచ్చునని నిపుణులు లెక్కలు కట్టారు!

## ఇంద్రధనుస్సు





### పాబ్లో పికాసో

ఇరవైయవ శతాబ్దానికి చెందిన సుప్రసిద్ధ చిత్రకారుడు, శిల్పి అయిన పికాసో 1881వ సం॥లో స్పెయిన్ దేశంలో జన్మించాడు. పసిప్రాయం లోనే అతడు చిత్రకళ పట్ల అమిత ఆసక్తినికనబరచాడు. అతడు పలికిన మొట్టమొదటి మాట 'లాపిజ్' (పెన్సిల్) అనీ, అడుగులు వేయడానికి ముందే బొమ్మలు వేయడం నేర్చాడనీ అతన్ని గురించి చెబుతారు. అతడు గొప్ప సంప్రదాయ చిత్రకారుడు కాగలడని పలువురు ఆశించారు. అయినా అతడు చిత్రకళ సంప్రదాయాలకు పూర్తిగా భిన్నంగా చిత్రాలు గీయడం మొదలు పెట్టాడు. చుట్టూవున్న ప్రపంచాన్ని దర్శించడానికి సరికొత్త రూపాలతో నూతన మార్గాలు ప్రవేశపెట్టాడు. సరళమైన క్షేత్ర రేఖా చిత్రాలతో, చాలా తక్కువ రంగులుఉపయోగించి, భావస్ఫోరకమైన 'క్యూబిస్ట్'చిత్రాలు గీయడంలో ఆయన ప్రపంచ ప్రసిద్ధి గాంచాడు.

స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సర చందమామ కానుక!

# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం



[వర్తకం చేసుకోవడానికి రాజుల నుంచి అనుమతి పొంది, భారతదేశంలో అడుగుపెట్టిన బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ క్రమంగా, అనైక్యతతో వున్న స్థానిక పాలకుల నుంచి భూ భాగాన్ని ఆక్రమించసాగింది. మరి కొన్నేళ్ళలో భారతీయ రాజులకు ఆంక్షలు విధించే స్థాయికి ఎదిగింది. సంతానం లేకుండా మరణించే సంస్థానాధీశుల రాజ్యం కంపెనీకి చెందగలదని ప్రకటించింది.సంతతి లేని ఝూన్సీరాజు, తన భార్య రాణి లక్ష్మీబాయికి బిడ్డను దత్తత చేసుకోమని చెప్పి మరణించాడు. లక్ష్మీబాయి చేసుకున్న దత్తత చెల్లదనీ, ఝూన్సీరాజ్యం తమకే సంక్రమిస్తుందనీ కంపెనీ ప్రకటించింది. ఆ విషయం రాణి లక్ష్మీబాయికి తెలిసి ఆగ్రహం చెందింది. —తరవాత]

ఝూన్సీ ప్రజలు రాణి లక్ష్మీబాయి పట్ల అపారగౌరవాదరాలు కనబరచేవారు. పండితులు - పామరులు, రైతులు -వ్యాపారులు, అధికారులు - పూజారులు ఇలా ప్రజలందరూకూడాతమనుపాలించే లక్ష్మీబాయిని తమ రక్షకురాలిగా, తల్లిగాభావించసాగారు. సాధారణ ప్రజలు ఝూన్సీరాణి నివసించే రాజప్రాసాదం పక్కన నడిచేప్పుడు, "మహారాణికీ జై! విదేశీయులు మహారాణికి ఏదైనా హానితలపెడితే సహించం! మహారాణిని కాపాడడానికి మా ప్రాణాలయినా అర్పిస్తాం!" అని ఆవేశంతో నినాదాలు చేసేవారు.

ఈస్టిండియాకంపెనీ ఝూన్సీ రాజ్యాన్ని వశపరచుకోవాలన్న నిర్హేతుకమైన– నిర్ణయం తీసుకోవడానికి ముందు, రాణి లక్ష్మీబాయి దినచర్య ఎంతో సంప్రదాయబద్ధంగా ఉండేది.

రాణి లక్ష్మీబాయి రోజూ సూర్యోదయా నికి ముందే నిద్రలేచి, పన్నీటి స్నానం చేసి తెల్లటి చండేరీ చీర కట్టుకుని నిత్య పూజకు ఉపక్రమించేది. కొంతసేపు ధ్యానంలో గడిపి, తులసీవనంలో తులసీ పూజ పూర్తిచేసుకుని పార్థివపూజకు పూనుకు నేది. ఆస్థాన సంగీతకారులు భక్తిగీతాలు ఆలపించేవారు. పౌరాణికులు పురాణ పఠనం చేసేవారు. ఆ తరవాత ఆస్థానం లోని ప్రముఖులూ, సైనికులూ వచ్చి రాణికి నమస్కరించేవారు. ఆమె ప్రతి నమస్కారం చేసేది. ఆస్థానంలోని దాదాపు ఏడువందలా యాభై మందిలో ఏ ఒక్కరు కనిపించకపోయినా మరునాడు కారణం అడిగి పలకరించేది. అది అద్భుతమైన ఆమెజ్ఞాపకశక్తికి తార్కాణంగా ఉండేది!

మధ్యాహ్నంపైన ఆమెఅందమైన కిరీటం లాంటి టోపీతో పురుషవేషం ధరించి, మొలకు రత్నాలు పొదిగిన ఒరలో కత్తిని వేలాడదీసుకుని, దర్బారుకు హాజర య్యేది. మెడలో ఒక రత్నాలహారం, చేతులకు వజ్రాల కడియాలు, వేలికి వజ్రపుటుంగరం మాత్రం ధరించేది. జుట్టు వెనక్కు ముడివేసుకుని తెల్లచీర కట్టుకునేది. పురుషవేషంలోనూ, స్త్రీ దుస్తులతోనూ ఠీవిగా ఆస్థానానికి వచ్చే ఆమె చూడడానికి అపర గౌరీదేవిలాగా ఉండేది.

ఆమె అప్పుడప్పుడు తామరతటాకం సమీపంలో వున్న మహాలక్ష్మి ఆలయానికి వెళ్ళేది.ఒకనాడు ఉదయం ఆమె ఆలయ దర్శనానికి వెళ్ళి తిరిగి వస్తూండగాచాలా మంది ప్రజలు ఆమెను దూరం నుంచి చూడసాగారు. వాళ్ళలో ఎక్కువ మంది ఒంటి మీద బట్టలులేక చలితో వణుకు తున్నారు!





రాణి రాజభవనం చేరిన వెంటనే దర్జీలను పిలిపించి చొక్కాలూ టోపీలూకుట్టమని ఆదేశించింది. అనుకున్న సమయానికి వేలకొద్ది చొక్కాలు తయారయ్యాయి. వెంటనే వాటిని పేదలకు పంచిపెట్టారు. రాణి లక్ష్మీబాయి మరుసటి వారం ఆలయానికి వెళ్ళినప్పుడు అక్కడి పేద ప్రజలందరూ బట్టలు ధరించి వుండడం చూసి, ఎంతో సంతోషించింది. అంతే కాదు; ఆ పేద ప్రజలు కూడా తమను చలి బాధ నుంచి కాపాడిన రాణిగారిని చూడగానే ఆనందంతో చేతులెత్తి దణ్ణాలుపెట్టి తమ కృతజ్ఞతలు తెలియజేశారు.

ఝాన్సీరాణికి తమ ప్రజల పట్ల ఆదరాభిమానాలూ, ప్రజలకు ఆమెపై గౌరవాదరాలూ ఉండేవి. కాని రాజ్య రక్షణకు పరస్పర ఆదరాభిమానాలు మాత్రమే చాలవుకదా! కంపెనీ అధికారులు కుట్రలు కుయుక్తులు నేర్చిన దుర్మార్గులు. తమ రాజ్య విస్తరణకూ, చిన్న రాజ్యాలను లోబరచుకోవడానికీ ఎటువంటి అవినీతికరమైన మార్గాన్నయినా అనుసరించడానికి వెనుకాడని కుటిల వర్తనులు. అటువంటి వాళ్ళను సమర్థవంతంగా ఎదుర్కోవాలంటే ధైర్యంతో పాటు మంచి తెలివితేటలు గల సలహాదార్లు కావాలి. తమ శ్రేయోభిలాషులనూ, మద్దతుదార్లనూ ఒక గొడుగు కిందికి తీసుకురావాలి. ఈ విషయంలో రాణి లక్ష్మీబాయికి సహాయపడిన వారిలో మున్నెన్న తగినవాడు లక్ష్మీబాయికి సోదర సమానుడైన పూరీ చందన్ హుజూర్!

ప్రాచీన పుణ్యక్షేత్రంగా ప్రసిద్ధిగాంచిన పూరీ నగరంలో చందన్ హుజూర్ అనే ఒక యువకుడు ఉండేవాడు. లక్ష్మీబాయి ఐదేళ్ళ బాలికగా ఉన్నప్పుడు తల్లిదండ్రులతో కలిసి పూరీ క్షేత్రానికి వెళ్ళింది. ఆ కాలంలో జగన్నాథ దర్శనానికివెళ్ళే భక్తులు ఆలయ పూజారుల సత్రాలలోనే బసచేసేవారు. అలా బసచేసిన లక్ష్మీబాయి కుటుంబాన్ని ఒక పూజారి కుమారుడైన చందన్ ఎంతో ఆప్యాయతతో చూసుకున్నాడు. ముఖ్యంగా లక్ష్మీబాయి పట్ల సహోదర వాత్యల్యాన్ని కనబరిచాడు. లక్ష్మీబాయి తల్లిదండ్రులు కూడా చురుకైన చందన్‌ను తమ బిడ్డలాగా భావించారు. వాళ్ళకోరిక ప్రకారం లక్ష్మీబాయి ఒక శుభఘడియలో, ఆలయంలో ఇచ్చిన జగన్నాథ మహాప్రసాదాన్ని తన చిన్నారి చేతులతో చందన్

నోటికి అందించి అతన్ని, "అన్నయ్యా!" అని పిలిపించి.

"చాలా సంతోషం చెల్లెమ్మా! ముందు ముందు నీ జీవితంలోని సుఖ సంతోషాలను ఈ అన్నయ్యతో పంచుకోవడానికి మరిచిపోకు సుమా!" అన్నాడు చందన్ ఆనందబాష్పాలతో.

కొంతకాలం తరవాత లక్ష్మీబాయి ఝాన్సీరాణి అయిందన్న వార్త విని చందన్ మురిసిపోయాడు.

చందన్ పెళ్ళికి, రాణి లక్ష్మీబాయి దూత ద్వారా చాలా విలువైన కానుకలు పంపింది. వాటిని చూసి చందన్ ఎంతో ఆనందించాడు. అయితే ఝాన్సీ రాజ్యానికీ, రాణి ప్రాణానికీ రానున్న ఆపద గురించి తెలుసుకుని బాధపడ్డాడు. పెళ్ళయిన మరురోజే తనకు కానుకలు తెచ్చిన దూతతో పాటు ఝాన్సీకి బయలుదేరాడు!

చందన్ ఝాన్సీకి చేరుకునే నాటికి అక్కడి పరిస్థితి మరింత తీవ్రంగా తయారయింది. చందన్‌ను చూడగానే రాణిలక్ష్మీబాయి కళ్ళుఒక్కక్షణం ఆనందంతో మెరిశాయి. కాని చందన్ పెళ్ళయిన మరునాడే బయలుదేరిరావడం విని విచారపడింది. దానిని గురించి అతన్ని అడిగింది.

"చెల్లెలు బాధలలో ఉన్నప్పుడు ఏ అన్నయినా సంతోషంగా ఉండగలడా?" అని ఎదురుప్రశ్న వేసిన చందన్ కంఠస్వరం కాస్త తగ్గించి, "అదిసరే, ఒకవేళ యుద్ధమే వచ్చిందనుకో. అప్పుడు ఇతర రాజ్యాల రాజులు నీకు సహాయపడగలరా?" అని అడిగాడు.



"సహాయం చేయగలమని కొందరు బహిరంగంగా తెలియజేశారు. మరికొందరు తెలియచేయలేదు. అయినా, విశ్వాసఘాతకులైన తెల్లవాళ్ళతో జరిగే యుద్ధానికి సాయంచేయకుండా ఎవరూ ఉండలేరని నానమ్మకం!" అన్నది లక్ష్మీబాయి.

"అయినా, మనం నమ్మలేని విషయాలు కూడా జరగవచ్చు చెల్లెమ్మా! నేను రాత్రి ఒక సత్రంలో బస చేసినప్పుడు అక్కడ ఇద్దరు ప్రయాణీకులు మాట్లాడుకోవడం విన్నాను. ఒక ప్రయాణీకుడిది గ్వాలియర్, మరొకడిది ఢిల్లీ. ఆ రెండు సంస్థానాల రాజులూ నీ పక్షంలో ఉన్నారా?" అని అడిగాడు చందన్.

"ఆ విషయం నాకు తెలియదు, అన్నయ్యా!" అన్నది రాణి లక్ష్మీబాయి.

"ఆ ఇద్దరు సంస్థానాధీశులూ కంపెనీ పక్షం వహిస్తున్నారని ఆ ప్రయాణీకుల మాటలను బట్టి తెలుస్తున్నది!" అన్నాడు చందన్.

"అలాగా!" అన్నది రాణి ఆశ్చర్యంగా.

"నేను విన్నది నిజం కాకూడదనే ఆశిస్తున్నాను. అయినా, కొందరు రాజులు ముఖ్యంగా తమ బంధువులు శత్రుపక్షం వహించారంటే పర్యవసానం భయానకంగా విషమించగలదు. నీకు నానా సాహెబ్ సహాయం లభిస్తుంది. మీరిద్దరూ కలిస్తే కంపెనీని ఎదుర్కోవచ్చు!" అని చందన్ కొంతసేపు ఆగి, "ఏది ఏమైనా సరే అన్నయ్యనైన నా కోర్కెను కాదనను అని మాట ఇవ్వు చెల్లెమ్మా!" అన్నాడు.

ఏమిటి అన్నట్టు చూసింది రాణి.

"నేను ఎప్పుడూ నీదగ్గరే ఉండడానికి అనుమతించాలి. నా కంఠంలో ప్రాణం ఉండగా నీకే ఆపదా రానివ్వను. నీకేదైనా ఆపద వాటిల్లే పక్షంలో అది నా శవం మీదే జరగాలి!" అన్నాడు చందన్.

"అన్నయ్యా! నా రక్షణపట్ల అంతగా దిగులు పడనవసరం లేదు. నా భర్త మరణం తరవాత కూడా నేను ప్రాణాలతో ఉన్నానంటే అది నా ప్రజల రక్షణకోసమే. నిష్ప్రయోజనమైన జీవితం పట్ల నాకు ఆశలేదు. అదేవిధంగా నిరుపయోగంగా మరణించడానికీ ఇష్టంలేదు. ఒక మంచి పనికోసం మరణించడం మహాభాగ్యంగా భావిస్తున్నాను. నాతోపాటు అమాయకులైన నా ప్రజలు పలువురు ప్రాణాలు కోల్పోగలరన్న బాధ తప్ప మరొకటిలేదు!" అన్నది రాణిలక్ష్మీబాయి గంభీరస్వరంతో.

"ప్రజలు ధైర్యవంతులు చెల్లెమ్మా! స్వాతంత్ర్యంకోసం ప్రాణత్యాగం చేయడానికి వాళ్ళుకూడా సిద్ధపడగలరు!" అన్నాడు చందన్.

రాణిలక్ష్మీబాయి కొంతసేపు మౌనం వహించి, "అన్నయ్యా! నువ్వు పూరీకి తిరిగి వెళ్ళి కొత్తగా పెళ్ళయిన భార్యతో హాయిగా కాలం గడపాలి. నాకు నీ ఆశీస్సులుఉంటే చాలు!" అంటూ నమస్కరించింది.

"నా ఆశీస్సులు నీకు ఎల్లప్పుడూ ఉంటాయి. అలాగే నేనూ నీతో ఉండి తీరుతాను!" అన్నాడు కృతనిశ్చయంతో చందన్ హుజూర్! — (ఇంకావుంది)





ఉత్సాహంగా వుండలేక పోతున్నాను," అన్నాడు కాంక్షితుడు.

"ఉత్సాహంగా వుండాలంటే, జీవిత మెలావుండాలి నీకు?" అని యోగి అతణ్ణి కుతూహలంగా అడిగాడు.

"ఉన్నపళంగా నా ఆస్తి పదిలక్షల వర హాలు కావాలి. నా భార్య రాజకుమారి కావాలి. అస్తమానం అందరూ నన్ను ప్రశం సలతో ముంచెత్తుతూ వుండాలి. అప్పుడు జీవితం నాకు ఉత్సాహంగా వుంటుంది," అన్నాడు కాంక్షితుడు.

దానికి శివానందుడు చిరునవ్వు నవ్వి, "ఎవడి జీవితానికి వాడేరాజు. వాడిభార్య రాజకుమారేం– మహారాణి అవుతుంది. ప్రతివాడికీ జీవితం పదిలక్షలేమిటి – కోటి వరహాల విలువచేస్తుంది. ఎదుటివాడు మనలను నిందించకుండా వున్నంత కాలం, మనజీవితానికి ప్రతిక్షణం ప్రశం సలు లభించినట్టే అవుతుంది. అంతా మన ఊహలో వుంది. ఉందనుకుంటే లేనిది లేదు; లేదనుకుంటే ఉన్నది లేదు," అన్నాడు.

"స్వామీ! ఇదంతా వేదాంతం. నావంటి సామాన్యుడికి అర్థం కాదు. కాబట్టి, నా కోర్కెలు తీరే మార్గాలుంటే చెప్పండి, అనుసరిస్తాను. లేదా నన్నిలాగే బ్రతకని వ్వండి," అన్నాడు కాంక్షితుడు మొండిగా.

"అయితే నీకు నచ్చిన అందమైన పిల్లను పెళ్ళిచేసుకో, ఆ తర్వాత నీ ఆస్తి పదిలక్షల వరహాలవుతుంది. నీ భార్యరాకు మారి అవుతుంది. అస్తమానం అందరూ నిన్ను అదేపనిగా పొగుడుతూంటారు. సరా?" అన్నాడు యోగి.

ఆనందంతో కాంక్షితుడి కళ్ళు పెద్ద వయ్యాయి. అయినా అనుమానంగా, "స్వామీ! ఇది వేదాంతం కాదు గదా?"అని అడిగాడు.

శివానందుడు హామీయిస్తున్నట్టుగా చేయి ఊపి, "నే చెప్పిన వన్నీ నిజంగానే జరుగుతాయి. అయితే ఇంకో విషయం కూడా నిజం. ఇన్ని జరిగినా కూడా నీ జీవితం మునుపటి లాగానే వుంటుంది. ఏ మార్పూ వుండదు. ఉత్సాహం డబ్బు తోటీ, సుఖాలతోటీ, ప్రశంసలతోటీ వచ్చేది కాదు. అది ఆలోచనల్లోంచే పుట్టాలి. అందుకు మంచి మనసుండాలి,"అన్నాడు.

ఈ మాటలు కాంక్షితుడిపై బాగా పనిచేశాయి. అతడు ఎంతో అందంగా

వుండే అంబను పెళ్ళి చేసుకున్నాడు. అంబ బుద్ధిమంతురాలు, పనిమంతురాలు. ఆమె భర్తను కంటికి రెప్పలా చూసుకునేది. ఏ పని చేసినా అతడినే దృష్టిలో వుంచుకునేది.

పెళ్ళయిన ఏడాదికి ఆ దంపతులకు పండంటి కొడుకు పుట్టాడు. కాంక్షితుడు వాణ్ణి చూసుకుని మురిసిపోయాడు. అప్పటి నుంచీ అతడికి కొడుకంటే చెప్ప లేనంత అభిమానం పుట్టుకొచ్చింది. వాడి జీవితం తన మాదిరిగా వుండకూడదని, వ్యాపార విషయంలో మరింతగా కృషి చేయసాగాడు. కానీ ఎంత ప్రయత్నించినా అతడి వ్యాపారం ఎదుగూ బొదుగూ వున్నట్లనిపించడంలేదు. ఆదాయం కొంత పెరిగినా, ఖర్చులు కూడా అందుకు తగ్గట్టే క్రమంగా పెరుగుతుండడం అందుక్కారణం.

అంబ పొదుపుగా వుండేది. నగలు, ఖరీదైన చీరెలు కావాలని, ఆమె భర్త నెన్నడూ వేధించలేదు. తరచుగా ఆమె, భర్తతో, "మనకు కడుపునిండా తిండికి లోటులేదు. అన్నీ తినడానికి తగిన ఆరోగ్య ముంది. నిలువనీడగా పెద్ద ఇల్లు వుంది. ఇంతకు మించి ఎవరైనా ఏం కోరుకుంటారు?" అంటూండేది.

తీరిక వేళల్లో సంగీతం అభ్యసించేది, అంబ. నేర్చుకుంటున్నందు కామెకూ, వింటూ కాంక్షితుడికీ, ఆ సంగీతం వల్ల ప్రశాంతత లభించేది. అంబకు ఎంతటి సహజ పాండిత్యమున్నదంటే - ఒక్క ఏడాదిలోనే నగరంలో జరిగిన సంగీత



పోటీలలో ఆమె ప్రథమురాలుగా బహుమతినందుకున్నది.

ఇలావుండగా, నగర పరిసరాల్లో వజ్రాలు లభించే ప్రదేశాలున్నట్టు తెలిసింది. ఎందరో వజ్రాల నిపుణులు, వర్తకులు భవానీపురానికి తరలి రాసాగారు. మంచి ధర పలుకుతున్నందున, కాంక్షితుడి చుట్టుపక్కల వాళ్ళు చాలామంది, వజ్రాల నిపుణులకు తమఇళ్లూ, స్థలాలూ అమ్ముకుని దూర ప్రాంతాలకు వెళ్ళిపోయారు. కాంక్షితుడు వ్యాపారి కావడంవల్ల కొత్త చోటుకు వెళ్ళి వ్యాపారం ప్రారంభించలేక అక్కడే వుండిపోయాడు.

కాంక్షితుడి చుట్టూవున్న వారందరూ డబ్బులో మునిగి తేలుతున్నారు. అతడి నెలసరి ఆదాయం, వారి ఒక్కరోజు



విలాసాలకు చాలదు. వాళ్ళందరికీ కూడా ఏవో కొన్ని దురలవాట్లున్నవి. వారిమధ్య కాంక్షితుడొక్కడే మామూలు మనిషి.

ఒక విధంగా కాంక్షితుడికిది ఇబ్బంది గానే వున్నది. అంతమంది భాగ్యవంతుల మధ్య తానొక్కడూ పేదవాడు. నిజానికి తను పేదవాడు కాదు కానీ, చుట్టుపక్కల వారి సంపద అలా అనుకునేలా చేస్తున్నది.

"యోగి నాకు అన్నీ అబద్ధాలే చెప్పాడు. పెళ్ళయి నాలుగేళ్ళు కావస్తున్నది. నాఆస్తి పెరగలేదు. నా భార్య రాజకుమారికాలేదు. నాకు ప్రశంసలు లభించడం లేదు," అనుకుని వాపోతూండే వాడు కాంక్షితుడు.

ఈస్థితిలో, ఒకరోజున శివానందుడు భవానీపురానికి వచ్చి, కాంక్షితుణ్ణి చూడబో యాడు. ఆ సమయంలో కాంక్షితుడుతన కొడుకుతో ఆటలాడుతున్నాడు. యోగి అతణ్ణిచూసి, "ఆహా, ఇప్పుడు నీముఖంలో ఉత్సాహం పెల్లుబుకుతున్నది. వివాహం చేసుకున్నాక నీ జీవితంలో గొప్ప మార్పు వచ్చిందనే అనుకోవాలి," అన్నాడు.

కాంక్షితుడు కొడుకును లోపలకు పంపించి, యోగికి ప్రణామం చేసి, "స్వామీ! ఇప్పుడు నాకు జీవితంమీద విరక్తి భావం లేదు. అయితే మీరు చెప్పిన మార్పుల్లో ఒక్కటీ నా విషయంలో జరగలేదు," అన్నాడు.

యోగి నవ్వి, "నేను చెప్పిన మార్పులన్నీ నీ జీవితంలో వచ్చాయి. అయినా జీవితం ఎప్పటిలాగే వుంటుందని కూడా చెప్పాను కదా - అదే జరిగింది!" అన్నాడు.

కాంక్షితుడు ఆశ్చర్యపోయి, "స్వామీ! నా జీవితం ఎప్పటిలాగే వుండడం నిజం. కానీ మీరు చెప్పిన మార్పులు నాకు తెలి యకుండా ఎలా పోయాయో వివరించ గలరా?" అని అంటూండగా, పక్కింటి నుంచి ఒక వృద్ధురాలు వచ్చి, కాంక్షితుణ్ణి పలకరించి, "నాయనా! నీ వంటి ఉత్త ముణ్ణి కన్న తలిదండ్రులు అదృష్టవం తులు. నా బిడ్డలూ వున్నారు. ముగ్గురికి ముగ్గురూ తాగుబోతులు. కాసేపు నీఇంట కూర్చుని పురాణంచదువుకుని వెళతాను. నీకు అభ్యంతరం లేదుకదా!" అన్నది.

కాంక్షితుడు సరేననగానే ఆమెలోపలకు వెళ్ళింది.

యోగి చిరునవ్వు నవ్వి, "నీ చుట్టు పక్కలవారి దురలవాట్ల కారణంగా, ప్రతి రోజూ ఎవరో ఒకరు నిన్ను ప్రశంసలతో

ముంచెత్తడం లేదా?" అన్నాడు. కాంక్షితుడు తెల్లబోయి నిజమేనని ఒప్పుకున్నాడు. అంతలో కాంక్షితుడి భార్య లోపలి నుంచి యోగి కోసం పాలు తెచ్చింది. యోగి పాలలోటా అందుకుని, "అమ్మాయీ! కొద్ది రోజుల క్రితం నువ్వు పాటల పోటీలో ప్రథమ బహుమతి పొందావు కదా! అక్కడ నీకు లభించిన బిరుదు ఏమిటి?" అని అడిగాడు.

ఆమె సిగ్గుపడుతూ తలవంచుకుని, "సంగీత రాకుమారి!" అన్నది.

"చూశావుగా, నీ భార్య రాకుమారి అయింది," అన్నాడు యోగి.

దీనికి అసంతృప్తిగానే తల ఊపుతూ, "అయితే, నా ఆస్తి విషయ మేమిటి, స్వామీ?" అని అడిగాడు కాంక్షితుడు.

"నీఇల్లు, ఖాళీగా వున్న స్థలం అమ్మితే ఎంతవస్తుందో చుట్టుపక్కల వారి నెవరినైనా అడిగి చూశావా?" అని ప్రశ్నించాడు యోగి.

కాంక్షితుడు ఉలిక్కిపడి, "అవును. అది పదిలక్షల వరహాలకు పెరిగిపోయింది. కానీ ఇది అమ్ముకుని నేనెక్కడికి పోతాను? పుట్టి పెరిగిన నగరం, బాగా తెలిసిన ప్రాంతం," అన్నాడు.

"నీకు యోగముంది కాబట్టి, జీవితంలో నువ్వు కోరిన మార్పులన్నీ వచ్చాయి. అయినా నీ జీవితం ఎప్పటిలాగే వున్నదంటే అందుక్కారణం, నీ ఆలోచనల్లో మార్పు లేకపోవడం. ఉన్నచోటు విడువకుండా, చేసే వ్యాపారం మానకుండా జీవితంలో మార్పుకోరుకుంటే ఎన్ని మార్పులొచ్చినా ఆ జీవితం ఎప్పటిలాగే వుంటుంది. నువ్వు నిజంగా మార్పును కోరుకుంటే, ముందు నీ ఆలోచనల్లో మార్పు రావాలి. కాదంటావా?" అన్నాడు శివానందుడు.

కాంక్షితుడి కళ్ళు తెరుచుకున్నాయి. అతడు యోగికి ప్రణామం చేసి, "స్వామీ! నా జీవితం ఎంతో బాగున్నది. ఈ అదృష్టాన్ని గుర్తించక మార్పును కోరడం, నా పొరబాటు. నేనిక్కడే వుంటాను. ఇలాగే జీవిస్తాను. ఇక మీదట నా జీవితంలో నిరుత్సాహమన్నదేవుండదు," అన్నాడు.

యోగి తృప్తిగా తలాడించి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు **1997** నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



S.G. SESHAGIRI



MAHANTESH C. MORABAD

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * సెప్టెంబర్ నెల **25**వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, చెన్నయ్ - **600 026**

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎక్కటానికెందుకురా తొందర?

రెండవ ఫోటో : నిండిన పాత్ర చూడు ముందర!

పంపినవారు : శ్రీమతి ఎమ్. రాధారాణి, W/o. ఎమ్.పి. పవన్‌కుమార్

**8/48-1**, రాజావీధి

గూడూరు **-524101** నెల్లూరు జిల్లా (ఆం.ప్ర)

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 72-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్ - **600 026**

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., Chandamama Buildings, Chennai - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, 188, N.S.K. Salai, Vadapalani, Chennai - 600 026 (India) Editor : NAGI REDDI.